శ్రీరస్తు.

శ్రీమతే రామానుజాయ నమః.

మదరాస్ సద్గ్రంథప్రకాశనసభయొక్క

ఆఱవ ప్రచురము. ౬.

Satgrantha Prakasana Sabha,
MADRAS.
TELUGU PUBLICATION No. 6

# పెరియాళ్వార్ తిరుమొళిసారము

(పెరియాళ్వారు సాయించిన ౪౬౧ పాశురములయొక్క సారార్థసంగ్రహము.)

సభవిద్వాన్.
కంచి. ప్రతివాదిభయంకరమ్. అణ్ణఙ్గరాచార్యులవారు
వ్రాసినది.

పాతచాకలపేట. గోపాలకృష్ణా ప్రెస్సులో
ముద్రితము.

దీని వెల. సభమెంబర్లకు ౧-౦-౦
ఇతరులకు ౧-౮-౦

1948

శ్రీ ర స్తు.

ఈగ్రన్థము కీర్తిమూర్తులై ధార్మికాగ్రేసరులైన వూర. శ్రీరాములుశ్రేష్ఠిగారి శాశ్వత జ్ఞాపకార్థముగ వారియొక్క ధర్మభార్య వూర. శ్రీదేవమ్మ ద్రవ్యసహాయమువల్ల ముద్రింపబడెను.

శ్రీరస్తు.

శ్రీమతే రామానుజాయ నమః.

మదరాస్ సద్‌గ్రంథప్రకాశనసభయొక్క

ఆఱవ ప్రచురము ౬.

Satgrantha Prakasana Sabha,
MADRAS.
TELUGU PUBLICATION No. 6

# పెరియాళ్వార్ తిరుమొళిసారము

(పెరియాళ్వారు సాయించిన ౪౬౧ పాశురములయొక్క

సారార్థసంగ్రహము.)

సభవిద్వాన్.

కంచి. ప్రతివాదిభయంకరమ్. అణ్ణఙ్గరాచార్యులవారు

వ్రాసినది.

పాతచాకలపేట. గోపాలకృష్ణా ప్రెస్సులో

ముద్రితము.

దీనివెల. సభమెంబర్లకు ౧-౦-౦

ఇతరులకు ౧-౮-౦

1948

శ్రీ గ స్తు.

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీ వైష్ణవ సంప్రదాయ సారార్థములు.

---

శ్రీవైష్ణవసంప్రదాయమున జనించి బాల్యప్రభృతి వైదికపద్ధతి యందుండువారు సాంప్రదాయికార్థములనన్నింటిని తెలుసుకొని కృతార్థులగుదురు. కొందఱు జన్మాన్తరపుణ్య విశేషముచే శ్రీవైష్ణవులుగ పుట్టియు కొంచమైనను సాంప్రదాయికార్థముల నెఱుఁగకయే బాల్యము మొదలు కేవలలౌకిక పద్ధతిలో ప్రవేశించి యితరవిషయకవ్యాసంగములచే కాలమును గడుపుచున్నారు. వీరు సైతము సాంప్రదాయికవిషయములను గొన్నిటినైనను ముఖ్యముగ దెలిసికొనుట మంచిదనిదలంచి అత్యావశ్యకములగు సాంప్రదాయికవిషయములను కొన్నిటిని మాత్రమే యిచట సంగ్రహముగ వ్రాయుచున్నారము.

ఆళ్వారులును ఆచార్యులును మన శ్రీవైష్ణవసంప్రదాయ సమున్నతికి అభివృద్ధికి ముఖ్యకారణభూతులై యున్నారు గనుక వీరితిరునామములను అవతరించిన కాలదేశములను లోకోపకారార్థముకావించిన విశేషములను మొట్టమొదట ముఖ్యముగ తెలుసుకొనవలయును.

## ఆ ళ్వా రు లు.

(1) పొయ్‌గైయాళ్వార్ (2) పూదత్తాళ్వార్ (3) పేయాళ్వార్ (4) తిరుమழிశైయాళ్వార్ (5) నమ్మాళ్వార్

(6) కులశేఖరాళ్వార్ (7) పెరియాళ్వార్ (8) తొండరడిప్పొడియాళ్వార్ (9) తిరుప్పాణాళ్వార్ (10) తిరుమజ్గైయాళ్వార్ అని పదుగురు ఆళ్వారులు ఈ వరుసక్రమముగనే యవతరించియున్నారు.

1. పొయ్గైయాళ్వార్—వీరికే సరోముని కాసార యోగియని తిరునామములు గలవు. వీరు శ్రీకాంచీ నగరంబున శ్రీయథోక్తకారిపెరుమాళ్ళ సన్నిధిప్రక్కననుండు ఒక తటాకమున సువర్ణతామరపుష్పమునందు ద్వాపరయుగాంతమున అవతరించి నూఱుపాశురములుగల "ముదల్ తిరువన్దాది" యను దివ్యప్రబంధమును సాయించియున్నారు.

2. పూదత్తాళ్వారులు—భూతమునియని వీరికి నామాంతరము గలదు. వీరు ద్వాపరయుగాంతమున తులామాస ధనిష్ఠా నక్షత్రమునందు "తిరుక్కడల్ మల్లై" (మహాబలిపురము) అను దివ్యదేశమున నవతరించి నూఱుపాశురముల చేనొప్పు "ఇరణ్డామ్ తిరువన్దాది" యను దివ్యప్రబంధమును కృపజేసియున్నారు.

3. పేయాళ్వారులు—వీరికి మహదాహ్వయులని తిరునామము. వీరు చెన్నపట్టణమునకు సమీపమునందు మైలాపూరునందు అల్పిశిమాస శతభిషనక్షత్రమున అవతరించి నూఱుపాశురములుగల "మూన్ఱామ్ తిరువన్దాది" యను దివ్యప్రబంధమును అనతిచ్చియున్నారు.

4. తిరుమళిశైయాళ్వారులు—వీరిని భక్తిసారముని యనియెదరు. ఈ మహనీయులు మదరాసుకు సుమారు 15

మైళ్లదూరమునసుండు మహీసార క్షేత్రమున "తిరుమఴిశై" యను దివ్యదేశమునందు తైనెల మఖానక్షత్రమునందు ఆవిర్భవించి ౯౬ పాశురములుగల "నాన్ముకన్ తిరువన్దాది" ౧౨౦ పాశురములచే నెఱయు "తిరుచ్చన్ద విరుత్తమ్" అను రెండు ప్రబంధములను సెలవిచ్చియున్నారు.

5. నమ్మాళ్వారులు—వీరికి శఠకోపముని పరాఙ్కుశముని వకుళాభరణముని ఇత్యాద్యనేక తిరునామములు గలవు. వీరు కురుకాపురి యనెడి ఆళ్వార్ తిరుగరియందు కలియుగారంభములో వైయాశి నెల విశాఖానక్షత్రమునం దవతరించి (1) నూఱు పాశురములుగల తిరువిరుత్తము, (2) ఏడుపాశురములుగల తిరువాశిరియము, (3) ఎనుబదియేడు పాశురములుగల పెరియ తిరువన్దాది, (4) వెయ్యిన్నినూటరెండు పాశురములుగల "తిరువాయ్మొఴి" అను నాలుగు వేదసారములైన నాలుగు దివ్యప్రబంధములను సాయించియున్నారు.

6. శ్రీకులశేఖరాళ్వారులు—వీరు మలయాళదేశమునందలి "వఞ్జిక్కళమ్" అను దివ్యదేశమున మాశిమాసమున పునర్వసు నక్షత్రమునందావిర్భవించి, 105 పాశురములచే రాజిలు "పెరుమాళ్ తిరుమొఴి" యనెడి దివ్యప్రబంధము నానతిచ్చియున్నారు.

7. పెరియాళ్వారులు—వీరికి శ్రీభట్టనాథులు శ్రీవిష్ణుచిత్తులు అనియు తిరునామములు గలవు. శ్రీవిల్లిపుత్తూరునందు ఆని నెల స్వాతీనక్షత్రమున ప్రణవస్థానమైన తిరుప్పల్లాండును

461 పాశురముగల పెరియాళ్వార్ తిరుమొళి యను రెండు ప్రబంధములను ప్రసాదించిరి.

8. తొండరడిప్పొడియాళ్వారులు—వీరిని భక్తాంఘ్రిరేణు వని మెదరు. వీరు చోళదేశమునందు "మండంగుడి" యను అగ్రహారమునందు మార్గళినెల జ్యేష్ఠానక్షత్రమున అవతరించి పది పాశురములుగల "తిరుప్పళ్ళియెళుచ్చి"నలువదియైదు పాశురములుగల 'తిరుమాలై' అను రెండు ప్రబంధములను రచియించినారు.

9. తిరుప్పాణాళ్వారులు – మునివాహనసూరియని నామధేయాంతరము వీరికి గలదు. శ్రీరంగనగర సమీపస్థితమగు ఉఱైయూరునందు కార్తికై మాస రోహిణీనక్షత్రమున అవతరించి పది పాశురములచే సలంకృతమైన "అమలనాది పిరాన్" అను ప్రబంధరత్నమును జేసిరి.

10 తిరుమఙ్గైయాళ్వారులు—వీరిని కలియన్, పరకాలసూరియనియు వ్యవహరింతురు. ఈమహనీయులు తిరువాలి తిరునగరికి సమీపముననుండు తిరుక్కుఱైయలూరునందు కార్తికై మాసము కృత్తికానక్షత్రమున ఆవిర్భవించి, శ్రీనమ్మాళ్వారులుసాయించిన వేదచతుష్టయమునకు శిక్షాదిషడంగరూపములైన (1) పెరియతిరుమొళి పా. ౧౦౮౪. (2) తిరుక్కుఱుందాణ్డకము ౨౦ పా. (3) తిరునెడుందాణ్డకము పా. ౩౦. (4) తిరువెళుకూత్తిరుక్కై పా. ౧॥ (5) శిఱియ తిరుమడల్ పా. ౧॥ (6) పెరియ తిరుమడల్ పా. ౧॥ అను ఆఱు ప్రబంధములను సాయించి యున్నారు.

శ్రీవైష్ణవసంప్రదాయమున పుణ్యవిశేషమువల్ల పుట్టిన వారు ముఖ్యముగ ఆళ్వారులయొక్కయు ఆచార్యులయొక్కయు అవతారదేశకాలాదులను, వారు జేసిన మహోపకారములను ఎఱుగుట యత్యావశ్యకమని చెప్పి ఆళ్వారులను గుఱించి యెఱుగదగిన విషయములన్నిటిని మొట్టమొదటనే విశదపఱచియున్నానుగదా ? ప్రకృతమాచార్యులయొక్క అవతారాదులను వివరించెదను.

ఆళ్వారులకు తరువాత చాలాకాలము శ్రీవైష్ణవసంప్రదాయప్రవర్తకులు ఫలానివారని నిర్ణయించుటకు లేనందునను, ఆళ్వారులుసాయించిన దివ్యప్రబంధములుగూడ ప్రచారములుగాక మూలబడియున్న సమయమున శ్రీమన్నాథమునులే బహుశ్రమపడి ఆళ్వార్ తిరునగరికి వేంచేసి యచట శ్రీ తింత్రిణీవృక్షమూలమునందు (ఆదిశేషాంశమైన చింతచెట్టుక్రింద) శ్రీనమ్మాళ్వారులవిషయమై వారియంతరంగశిష్యులగు శ్రీమధురకవులు సాయించిన కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధమును ౧౨ వేలుసారులు జపించి యోగదశలో శ్రీనమ్మాళ్వారులను సాక్షాత్కరింపజేసికొని వీరివలన నాలాయిరదివ్యప్రబంధములను సకలరహస్యార్థములను స్వీకరించి శ్రీవైష్ణవసంప్రదాయమును పలుతెఱుగుల ప్రకాశింపించియున్నారు.

ఈ నాథమునులు చిదంబరమునకు సుమారు 15 మైళ్ల దూరముననున్న కాట్టుమన్నార్ సన్నిధిలో ఆనిమాసము, అనూరాధానక్షత్రమున అవతరించిరి. వీరి శిష్యులు పుండరీకాక్షులనెడి ఉయ్యక్కొండాన్. వీరిశిష్యులు మణక్కాల్ నమ్బి

(శ్రీరామమిశ్రులు). వీరు సకలశాస్త్రపారంగతులైన యామునాచార్యులను (ఆళవన్దారులను) బహువిధములచే ననుసరించి తనకు శిష్యులుగ జేసికొని వీరిద్వారా మన సంప్రదాయమును పలుతెఱంగుల నభివృద్ధిపఱచిరి.

## శ్రీమన్నాథమునుల తనియను

శ్లో॥ నమోఽచిన్త్యాద్భుతాక్లిష్టజ్ఞానవైరాగ్యరాశయే।
నాథాయ మునయేఽగాధభగవద్భక్తిసిన్ధవే॥

## ఉయ్యకొణ్డారు తనియను

శ్లో॥ నమః పఙ్కజనేత్రాయ నాథశ్రీపాదపఙ్కజే।
న్యస్తసర్వభరాయాస్మత్కులనాథాయ ధీమతే॥

## మణక్కాల్ నంబి తనియను

శ్లో॥ అయత్నతో యామునమాత్మదాసమలర్కపత్రార్పణనిష్క్రియేణ।
యః క్రీతవానాస్థితయౌవరాజ్యం నమామి తం రామమమేయసత్త్వమ్॥

ఆళవందారు—ఆడిమాసమున నుత్తరాషాఢా నక్షత్రమున శ్రీమన్నాథమునుల యవతారస్థలమైన కాట్టుమన్నారు సన్నిధిలోనే యవతరించిరి. వీరు మహావిద్వాంసులు. సిద్ధిత్రయము, ఆగమప్రామాణ్యము, గీతార్థసంగ్రహము, చతుశ్శ్లోకి, స్తోత్రరత్నము మున్నగునవి వీరు సాయించిన గ్రంథములు. వీరి తిరువడిగళుల నాశ్రయించినవారు, తిరుకోట్టియూర్ నంబి, తిరుమలైనంబి, పెరియనంబి, తిరుమాలైయాణ్డాన్ మున్నగువారు పలువురుకలరు.

శ్లో॥ “యత్పదాంభోరుహధ్యానవిధ్వస్తాశేషకల్మషః ।
వస్తుతాముపయాతోఽహం యామునేయం నమామితమ్ ॥ ”

అనునది వీరి తనియను.

ఆళవందారుకు అనంతముగు శిష్యవర్గమున్నను అందు పెరియనంబియనువారే యనంతరాచార్యస్థానము నలంకరించినవారు. వీరుయుడయవరులకు ప్రధానాచార్యులు. శంఖ చక్రాంకనమును జేసి మంత్రోపదేశము నొనరించినవారే ప్రధానాచార్యులగుదురు.

శ్లో॥ కమలాపతికల్యాణగుణామృతనిషేవయా ।
పూర్ణకామాయ సతతం పూర్ణాయమహతే నమః ॥

అనునది యీ పెరియనంబిగారి తనియను.

ఉడయవర్లు—చైత్రమున నార్ద్రా నక్షత్రమునందు భూతపురి (శ్రీపెరుంబూదూరు)లో నవతరించిరి. వీరు పఞ్చాచార్యపదాశ్రితులని ప్రసిద్ధినొందినవారు. అదియెట్లన—

౧. పెరియనంబిగారి శ్రీపాదముల నాశ్రయించుట పైనఁజెప్పబడినది. ౨. తిరుక్కోట్టియూర్ నంబి శ్రీపాదముల సన్నిధిలో రహస్యార్థ శిక్షణము. 3. తిరుమాలైయాణ్డాను సన్నిధిలో తిరువాయ్ మొళియొక్క యర్థశ్రవణము. (అనగా భగవద్విషయ కాలక్షేపము.) ౪. అళ్వార్ తిరువరంగప్పెరుమాళరైయర్ శ్రీపాదముల సన్నిధిని దివ్యప్రబంధ మూలాధ్యయనమును నేక సదర్థగ్రహణమును. ౫. తిరుమలైనంబి శ్రీపాదములందు శ్రీరామాయణ కాలక్షేపము.

యోనిత్యమచ్యుతపదామ్బుజయుగ్మరుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే ।
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసిన్ధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥

అనునది పీఠతనియను. వీరు ౭౪ సింహాసనాధిపతులను స్థాపించిరి. అనేక శతసహస్ర శిష్యవర్గములున్నను నందు శ్రీగోవిందభట్టరు (ఎంబార్) అనువారే వీరి ప్రధానశిష్యులు.

వారు కాంచీప్రాంతముననున్న మధురమంగలమను గ్రామమున తైమాసమునందలి పునర్వసు నక్షత్రమున నవతరించిరి.

శ్లో॥ రామానుజపదచ్ఛాయా గోవిందాహ్వానపాయినీ ।
తదాయత్తస్వరూపా సా జీయాన్మద్విశ్రమస్థలీ ॥

అనునది వీరికి తనియను.

ఎంబారు శిష్యులు, శ్రీపరాశరభట్టరు. వీరు శ్రీకూరత్తాళ్వాను తిరుకుమారులు. వైశాఖమాసమున ననూరాధా నక్షత్రమునందు శ్రీరంగములో వీరియవతారము. వీరియొక్క వైదుష్యప్రభావమత్యద్భుతము. శ్రీభాష్యభగవద్విషయాదులు వీరికి అనితరసాధారణమగు సొమ్ము. శ్రీరంగరాజస్తవము, శ్రీగుణరత్నకోశము, అష్టశ్లోకి, భగవద్గుణ దర్పణమను సహస్రనామభాష్యము, క్రియాదీపమను నిత్యగ్రంథము మున్నగునవి వీరు సాయించిన గ్రంథములు.

శ్లో॥ శ్రీపరాశరభట్టార్యః శ్రీరఙ్గేశపురోహితః ।
శ్రీవత్సాఙ్కసుతః శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే ॥

అనునది వీరికి తనియను.

భట్టరు శిష్యులు నంజీయరు. వీరు తిరునారాయణపుర ప్రాంతమున పంగుని నెలలో నుత్తరఫల్గునీ నక్షత్రమున నవత రించి మొదట నద్వైతిగానుండియు భట్టరుయొక్క కృపచేత నే మన సంప్రదాయమునకు మరలి దర్శననిర్వాహమును చేసిన వారు. వీరికి షడ్దర్శన మహావిద్వాంసులని ప్రసిద్ధిగలదు. వీరు అపరవయస్సునందు నాలాయిర దివ్యప్రబంధములనధికరించి, తిరువాయ్మొழிకి ఒన్బదినాయిరప్పడియను వ్యాఖ్యానమును గూడ సాయించిరి. వీరి తనియను,

శ్లో॥ నమో వేదాన్తవేద్యాయ జగన్మఙ్గళహేతవే ।
యస్యవాగమృతాసారపూరితం భువనత్రయమ్ ॥ అనునది.

నంజీయరు శిష్యులు నంబిళ్ళైగారు. నంబూర్ వరదరా జర్ అని వీరికి పూర్వనామము. తిరుక్కలికన్రిదాసర్, లోకా చార్యర్ అని తరువాతి తిరునామములు. స్వాచార్యులైన నంజీయరు విశేషాభిమానముతో ననుగ్రహించినది 'నంబిళ్ళై' అను తిరునామము. వీరియొక్క సర్వజ్ఞత్వ మప్రతిమానము. ఉభయవేదాంతములయందును నద్వితీయమగు నుపన్యాససామ ర్థ్యము వీరికుండెడిది. "నంపెరుమాళ్ గోష్ఠియో! నంబిళ్ళై గోష్ఠియో" అని అతిశఙ్క కలుగునట్లు పెద్దగోష్ఠిలో ప్రవచ నముచేసిన మహాత్ములు అని వీరికి ప్రసిద్ధిగలదు. కార్తిక నెల కృత్తికానక్షత్రమున వీరి యవతారము.

శ్లో॥ వేదాన్తవేద్యామృతవారిరాశేర్వేదార్థ సారామృతపూరమగ్ర్యమ్ ।
ఆదాయవర్షన్తమహం ప్రపద్యే కారుణ్యపూర్ణం కలివైరిదాసమ్ ॥

అనునది వీరి తనియను.

ఈ నంబిళ్లైగారి శిష్యులు వడక్కు-త్తిరువీథిప్పిళ్లై, అను వారు. వీరికి కృష్ణపాదులని తిరునామము. వీరు ఆని నెలస్వాతిలో నవతరించిరి. నంబిళ్ళైసాయించిన యుపన్యాసముల నన్నింటిని వీరు గ్రంథరూపముగ సంకలనము చేసియున్నారు. అందు ప్రధానమై సుప్రసిద్ధమగునది ఈడు ముప్పత్తాఱాయిరప్పడి యను భగవద్విషయము.

శ్లో॥ శ్రీకృష్ణపాదపాదాబ్జే నమామి శిరసాసదా ।
యత్ప్రసాదప్రభావేన సర్వసిద్ధిరభూన్మమ ॥

అనునది వీరికి తనియను.

ఈ వడక్కుత్తిరువీదిపిళ్ళైగారి శిష్యులు పిళ్లైలోకాచార్యుల వారు. వీరు వారి తిరుక్కుమారులే. వీరు సుప్రసిద్ధములగు శ్రీవచనభూషణాద్యష్టాదశరహస్యగ్రంథములను నిర్మించినవారు. తులామాసమున శ్రోణా నక్షత్రమునందు శ్రీరంగములో వీరి యవతారము.

లోకాచార్యాయ గురవే కృష్ణపాదస్య సూనవే ।
సంసారభోగిసందష్టజీవజీవాతవే నమః ॥ ఇది వీరి తనియను.

ఈ పిళ్ళైలోకాచార్యులవారి శిష్యులు తిరువాయ్ మొళి ప్పిళ్ళై అనువారు, శ్రీశైలనాథార్యులని తిరునామము. వీరు కుంతీనగరమున వైయాశిమాసమున విశాఖానక్షత్రమునందు అవతరించిరి. వీరికి,

శ్లో॥ నమశ్శ్రీశైలనాథాయ కున్తీనగరజన్మనే ।
ప్రసాదలబ్ధపరమప్రాప్యకైంకర్యశాలినే ॥

అనునది తనియను.

ఈ తిరువాయ్మొழிప్పిళ్ళైగారిశిష్యులు మణవాళ మహామునులు. వీరు ఆదిశేషావతారభూతులును, శ్రీ ఉడయవరుల పునరవతారభూతులును. వీరి ప్రభావము అవాఙ్మనసగోచరము. అల్పిశిమాసమున మూలనక్షత్రమునందు ఆళ్వార్ తిరునగరిలో వీరియవతారము.

శ్లో॥ శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్ ।
యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరంమునిమ్ ॥

అనునది వీరి తనియను.

శ్రీరామానుజ మునులనుండి యింకొక గురుపరంపరయు బయలుదేరియున్నది. తిరుక్కురుగైప్పిరాన్పిళ్లాన్, ఎంగళాళ్వాన్, నడాదూరమ్మాళ్, సుదర్శనభట్టర్, కిడాంబి రామానుజప్పిళ్లాన్, వేదాంతదేశికులు అనువారు ఆపరంపరలోని యాచార్యులు.

శ్రీవైష్ణవసంప్రదాయమునం దిట్టి జ్ఞాతవ్యాంశములింకను లెక్కకు మీరియున్నవి. సంక్షేపముగమాత్రమే యిపుడు వానిని తెలియంజేయుట యయినది.

శ్రీవైష్ణవ సంప్రదాయ సారార్థము సమాప్తము.



శ్రీ ర స్తు.



ఆళ్వారెమ్బెరుమానార్ జీయర్ తిరువడిగళే శరణమ్.

కంచి. ప్రతివాదిభయఙ్కరమ్ అణ్ణఙ్గరాచార్యులవారు

ర చిం చి న

# పెరియాళ్వార్ తిరుమొళిసారము.

(పెరియాళ్వార్ తనియన్.)

గురుముఖమనధీత్య ప్రాహ వేదానశేషాన్
నరపతి పరిక్లృప్తం శుల్కమాదాతుకామః ।
శ్వశురమమరవంద్యం రఙ్గనాథస్య సాక్షాత్
ద్విజకులతిలకం తం విష్ణుచిత్తం నమామి ॥

అవతారిక—దివ్యప్రబన్ధసారము.

---

లక్ష్మీనాథారమ్భాం శఠరిపుయతిరాజమధ్యామాముపనఘాం ।
శ్రీమద్వరవరమునిరాట్పర్యన్తాం నౌమిపూర్వగురుపఙ్క్తిమ్ ॥
శ్రీకాంచీపరవాదిభీకరగురు శ్రీవంశలబ్ధోదయః
వేదాన్తద్వయసిన్ధుమగ్నధిషణో నానాకలాకోవిదః ।
శ్రీమద్ద్రావిడవేదసూక్తిసివహాన్ గీర్వాణవాణీమయైః
పద్యైర్వ్యాహృతవాన్ప్రయత్నమరసూద్యవిబుధానానన్దయన్వ్యత్యహా ॥

శ్రీవైష్ణవ సంప్రదాయములో పొయ్గై యాళ్వారు మొదలైన ఆళ్వారులు అవతరించి యీసంప్రదాయమును సర్వోత్తమముగ చేసిరి వీరిలో నమ్మాళ్వారులే ప్రధాన భూతులు, ఇతర ఆళ్వారులు వారికి అవయవభూతులని

సంప్రదాయము. నారలు రచించిన నాలాయిరదివ్యప్రబంధములకు ద్రావిడవేదము, ద్రావిడామ్నాయము, ద్రవిడోపనిషత్తు, ద్రావిడ బ్రహ్మ సంహిత అను నామాంతరంబులు గలవు. ఈదివ్య ప్రబంధములను ఆళ్వార్లు భక్త్యాధిక్యంబుచే లోకుల కనుగ్రహించిరి.

నమ్మాళ్వారుల కంతరంగశిష్యులయిన మధురకవి యాళ్వార్లనువారు భగవద్విషయముగా నొక పాశురమును కూడ పాడింపలేదు. అయినను స్వాచార్యులయిన నమ్మాళ్వారుల విషయముగా "కణ్ణినుణ్ శిఱుత్తాంబు" అను నొక చిన్న ప్రబంధమును పాయించిరి. దానినికూడ నాలాయిరంబున పెద్దలు చేర్చిరి. ఈవిషయంబును * వాయ్ త్త తిరుమన్దిర త్తిన్ మత్తిమమామ్ పదమ్బోల్, శీర్ త్త మదురకవి శెయ్ కలైయై, ఆర్ త్తపుగళ్ ఆరియర్గళ్ తాజ్గళ్ అరుళిచ్చెయల్ నడువే, శేర్విత్తార్ తాఱ్పరియం తేర్న్దు * అని మణవాళ మామునులు ఉపదేశ రత్నమాలలో పాయించి యున్నారు.

పెరియాళ్వారులకు ఆండాళు అను నొక పుత్రికయుండెను. జనకరాజునకు యాగభూమిలో సీత లభించినట్లు వీరికి తుళసితోటలో దొరకిన బాలికను పుత్రీస్నేహముతో పాలించుచుండిరి. ఈయాండాళునకు గోదా, చూడిక్కొడుత్త నాచ్చియారు మున్నగు నామాంతరంబులు గలవు. గోదా ప్రభావమును వేదాంత దేశికులు గోదాస్తుతిలో పాయించియున్నారు. అందు మొదటి శ్లోకము:—

* శ్రీవిష్ణుచిత్త కులనందన కల్పవల్లీమ్,
శ్రీరఙ్గరాజ హరిచందన యోగదృశ్యామ్।

సాక్షాత్ క్షమాం కరుణయా కమలామివాన్యాం,
గోదా మనన్యశరణః శరణం ప్రపద్యే॥

అని. భగవద్దివ్య మహిషులలో నొకతె యయిన యాండాళు కూడ తన భర్త్రృ విషయంబుగా "తిరుప్పావై, నాచ్చియార్ తిరుమొళి" అను రెండు దివ్యప్రబంధములను సాయించిరి. వానినికూడ పూర్వాచార్యులు నాలాయిరంబున చేర్చి యున్నారు. అని యిట్లు పన్నిద్దఱు సాయించిన దివ్య ప్రబంధములకు నాలాయిరం బని వ్యవహారము.

సంస్కృత భాషలో దివ్యపదంబునకు ఉత్తమోత్తమం బని యర్థము. * జన్మ కర్మచ మే దివ్యమ్ * దివ్యం దదామి తే చక్షుః * ఇత్యాద్యలందు వ్యవహరింపబడిన యీ దివ్యపదమే శ్రీవైష్ణవసంప్రదాయంబున ప్రమాణప్రమేయప్రమాతలయందు ప్రయుక్తమై పరమ విలక్షణమయిన సౌరభంబు నొందుచున్నది. చూడుడు:—ప్రమాణశ్రేష్ఠమయిన ద్రావిడవేదంబును దివ్య ప్రబంధనామమున వ్యవహరింతురు. ప్రమేయ స్థలము లయిన అర్చావతార స్థలములు దివ్యదేశంబులనబడును. ప్రమాతృశ్రేష్ఠులయిన పరాఙ్కుశ పరకాలాది ఆళ్వారులను దివ్య సూరులందురు. ఇట్లు దివ్యతమమయిన వ్యవస్థలభించిన భాగ్యమే భాగ్యము.

ఈ యాళ్వారుల యవతార క్రమమును మణవాళమామునులు * పొయ్‌గైయార్ పూదత్తార్ పేయార్, పుగళ్ మళిశై అయ్యన్ అరుళ్ మారన్ శేరలర్ కోన్, తుయ్యభట్ట నాదన్ అన్బర్ తాళ్ తూళి నఱ్పాణన్ నన్కలియన్ ఈదివర్ తోత్తత్తడైవాం ఇజ్గు * అని సాయించి యున్నారు. అవతార

క్రమమిట్లుండ పరాశరభట్టరు సాయించిన * భూతం సరశ్చ మహదాహ్వయభట్టనాథ శ్రీభక్తిసార కులశేఖర యోగి వాహాన్ । భక్తాంఘ్రిరేణు పరకాల యతీన్ద్రమిశ్రాన్ శ్రీమత్ప రాఙ్కుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్ * అను శ్లోకంబున నీ క్రమమును మార్చి సాయించి యుండుటకు కారణం బేమని యొక శంక గల్గుచున్నది. అవతార క్రమముగా శ్లోకమును రచించినచో వృత్తము కుదురదని దలంచి అనుపూర్విని వివక్షింపక రచించిరని కొందఱందురు. అదియంత సరియయిన సమాధానము కాజాలదు. అల్పజ్ఞులయిన మనమే క్రమమును కొంచమయినను మార్పక కవనముచేయు శక్తులై యుండగా భట్టరు అట్లుచేయ నశక్తులయిరి అను వాదము రమ్యముగాదు. "కాసార భూత మహదాహ్వయ భక్తిసారాన్, శ్రీ మచ్ఛఠారి కులశేఖర భట్టనాథాన్ । భక్తాంఘ్రిరేణు మునివాహన కార్తికేయాన్, రామానుజంచ యమినం ప్రణతోఽస్మి నిత్యమ్" అని శ్లోకము చేయవచ్చునే. కనుక భట్టరు సాయించినందుకు వేఱొక కారణమేయుండ దగును. అను నీశంకకు పెద్దలు సాయించు సమాధానము:—నమ్మాళ్వారులను అవయవిగాను ఇతరులను అవయవముగాను వ్యవహరించుట సంప్రదాయము గాదా? ఆయవయవక్రమమిట్లు నిర్ణయింపబడి యున్నది.

పూదత్తాళ్వార్లు—శిరము.

పొయ్‌గై యాళ్వార్లు }
పేయాళ్వార్లు } నేత్రములు.

పెరియాళ్వార్లు ముఖము.

తిరుమళిశై యాళ్వార్లు కంఠము.

| | |
|---|---|
| కులశేఖరాళ్వార్లు<br>తిరుప్పాణాళ్వార్లు | బాహుద్వయము. |
| తొండరడిప్పొడియాళ్వార్లు. | ఉరము, (ఱొమ్ము) |
| తిరుమంగైయాళ్వార్లు. | నాభి. |
| ఉడైయవర్లు. | తిరుపడి. అని |

* భూతం శిరో, హ్రాదమహాహ్వాయ మక్షియుగ్మం, భట్టార్య మాస్య, మథ భార్గవమస్య కంఠమ్। బాహూ వదన్తి కుల శేఖర యోగివాహౌ, దోర్మధ్యనాభిచరణానితరాః శఠారేః * అను ప్రాచీన శ్లోకమే దీనికి ప్రమాణము. ఆక్రమమునే యవలంబించి * భూతం సరశ్చ అను శ్లోకమును సాయించి చిట్టచివర అవయవిభూతులయిన నమ్మాళ్వార్లు చెప్పబడిరి అని.

అవతారక్రమంబున ప్రథములు గాకుండినను నమ్మాళ్వారులను అవయవిగాను ఇతరులను అవయవములుగాను చెప్పుటకు గారణము; భగవత్సంకల్పాధీనమయిన వారి ప్రభావమే యని సంగ్రహంబుగా చెప్పనగును. ఈ యాళ్వార్లు సాయించిన దివ్యప్రబంధంబు లన్నియు నొకప్పుడు లుప్తమైయుండె. ఆచార్య పరంపరలో ప్రథములయిన శ్రీమన్నాథమునులు ఆ దివ్యప్రబంధములకు ఉద్ధరింపగోరి పెద్దల నియోగంబుమీద నమ్మాళ్వారుల యవతార స్థలంబయిన ఆళ్వారు తిరునగరికేగి యచట నమ్మాళ్వారులు వేంచేసియుండిన "ఉఱంగాప్పుళి"యని ప్రసిద్ధమయిన చింతచెట్టుక్రింద వారి విషయంబయిన "కణ్ణినుణ్ శిఱుత్తాంబు" అను దివ్యప్రబంధమును ౧౨౦౦౦ ఆవృత్తులు నియమంబుగాననుసంధించెను. పిమ్మట యోగ

దశలో నమ్మాళ్వార్ వారలు సాక్షాత్కరించి నాథమునులకు నాలాయిరము నుపదేశించిరి. ఈవిషయమే * నాదనుక్కు నాలాయిర ముర్రైత్తాన్ వాళ్లియే * అని వాళ్ళి తిరునామంబున చెప్పబడియె. ఈకారణంబుచేతను నమ్మాళ్వార్ వారులకు ప్రాధాన్యము. *పత్యుః శ్రియః ప్రసాదేన ప్రాప్తసార్వజ్ఞ్యసంపదమ్। ప్రపన్నజనకూటస్థం ప్రపద్యే శ్రీపరాఙ్కుశమ్ * అను శ్లోకమిచట ననుసంధేయము. నమ్మాళ్వార్ వారులకే పరాఙ్కుశులు వకుళాభరణులు ఇత్యాది నామాంతరంబులు గలవు.

ఇట్టి మహామహిమంబునొందిన నమ్మాళ్వార్ వారు లుండియు దివ్యప్రబంధ వరుసలో పెరియాళ్వార్ వారులకే ప్రాథమ్యము అంగీకరింపబడియె. వేదారంభమున "హరిఃఓమ్" అని చెప్పునట్లు దివ్యప్రబంధారంభమున "తిరుప్పల్లాండు"ను సేవింపవలయునని సంప్రదాయము. తిరుప్పల్లాణ్డంతయు భగవన్మంగళాశాసనపరముగా నుండుటయే దీనికి గారణము. పల్లాండు అనగా మంగళాశాసనము. తిరుశబ్దము శ్రీశబ్దపర్యాయము. తిరుప్పల్లాండు అనగా శ్రీమంగళాశాసన ప్రబంధము అని యర్థము. శ్రీభాగవతము శ్రీభాష్యము ఇత్యాదులందువలె శ్రీశబ్దము మంగళార్థమేగాని లక్ష్మీవాచకముగాదు. ఎందుకై యెప్పుడు మంగళాశాసనము గావించిరి అను విషయము వీరి వైభవంబున చూడనగును.

అవాప్త సమస్తకాముడయిన సర్వరక్షకుడయిన భగవంతునియందు తాము తమకు మంగళమును ప్రార్థింపవలసియుండ, మంగళ నిధియయిన భగవంతునికి గూడ మంగళాశాసనము చేయవచ్చునా? అని కొందఱు శంకింతురు. ఇచట

పూర్వాచార్యుల సమాధానము:—భక్తులకు జ్ఞానదశ ప్రేమ దశ అను రెండు దశలు గలవు. జ్ఞానదశలో 'భగవంతుడు రక్షకుడు. మనము రక్ష్యులము. మనము వానినుండి మంగళంబుల నొందవలయును' అను రక్ష్య రక్షకభావము వ్యవస్థితంబై యుండును. ప్రేమదశలోనన్న రక్ష్య రక్షకభావము మాఱి యుండును. సర్వేశ్వరుని జ్ఞానశక్త్యాది దివ్యగుణంబులను మఱచి వాని సౌందర్యాదులనే యెల్లప్పుడు ననుసంధించి మనసుకరగిన ప్రేమపరవశులకు రక్ష్య రక్షక జ్ఞానమే మాఱిపోవును. వారు భగవంతుని రక్షింపనుంకింతురు. అఖిలహేయ ప్రత్యనీకుడయిన భగవంతునియందుగూడ కాలదేశాది వైపరీత్యంబువల్ల నేదియిన కీడు మూడునో యను శంకయుదయించును. ఆ యతిశంకయే మంగళా శాసనంబునకు హేతువగును. శ్రీరామాయణంబున దండకారణ్యంబున మహర్షులందఱును వానియవతార రహస్యమును ఎఱింగి యుండియు వానికి మంగళా శాసనము కావించినట్లు వాల్మీకి చెప్పె. * తే తం సోమమివోద్యంతం దృష్ట్వా వై ధర్మచారిణః। మంగళాని ప్రయుంజానాః ప్రత్యగృహ్ణా దృఢవ్రతాః * అని. ఈ ప్రాకృతమండల వృత్తాంతముండనిమ్ము. నిత్యవిభూతిలోనుండు శేష శేషాశనాది నిత్యసూరులుగూడ భగవద్రక్షాపరులై యుండునట్లు శ్రీగుణరత్నకోశంబున * స్నేహాదస్థాన రక్షా వ్యసని భిరభయం శార్ఙ్గచక్రాసిముఖ్యైః * ఇత్యాది శ్లోకంబున పరాశర భట్టరు సాయించిరి. కనుక భగవంతుని మంగళాశాసనము చేయుట స్వరూప విరుద్ధముగాదు స్వరూపానుబంధియే యగును.

ఇట్టి మంగళా శాసనమం దభిరుచి శ్రీపరాఙ్కుశ పర

కాలాదులకుం గూడ నున్నది. అయినను మంగళా శాసన విషయముగా నొక ప్రబంధమునే రచించి యుండుటచే వీరికే మంగళా శాసనాభిరుచి యధికముగా నుండునట్లు చెప్పుదురు, కనుకనే వీరికి పెరియాళ్వారను పేరువచ్చె, ఈవిషయమును * మంగళా శాసనత్తిల్ మత్ఱుళ్ళవాళ్వార్గళ్, తజ్గళార్వత్తళవుతానన్ఱి, పొజ్గుమ్ పరివాలే విల్లిపుత్తూర్ పట్టర్పిరాన్ పెత్ఱాన్, పెరియాళ్వారెన్నుమ్ పెయర్ * అను పాశురమున మణవాళ మామునులు సాయించిరి.

తిరుప్పల్లాణ్డులో పండ్రెండు పాశురంబులు గలవు, అందు మొదటి రెండు పాశురములచే సపరివారుడయిన భగవంతునికిని, ౩_౪-౫ వ పాశురంబులచే క్రమముగా భగవత్ప్రాప్తికాములను కైవల్యార్థులను ఐశ్వర్యార్థులను భగవన్మంగళాశాసనంబునకై పిలుచుటయు, ౬-౭-౮ వ పాశురంబులచే పిలిచిన ఆమూడధికారులు మంగళా శాసనము చేయుచువచ్చిన విధమును ౯-౧౦-౧౧ చే అందఱితోనుగూడి మంగళా శాసనంబును, ౧౨-వ పాశురము ఫలశ్రుతిగాను అమరియున్నది.

---

# తిరుప్పల్లాణ్డు సారాంశ సంగ్రహము.

శ్లో॥ తత్త్వం నిర్ణీయ రాజ్ఞస్సదసి కరివరేసన్ని వేశ్యాథరాజ్ఞా వీథీషు భ్రామ్యమాణో వియతి కమలయా సాకమీశం నిశామ్య। తస్మైభద్రాణి శంసన్ తదను బహువిధాన్ భక్తవర్గాంశ్చగోష్ఠ్యాం స్వీయాయాం యోజయంస్తైస్సహరచితనుతిర్విష్ణుచిత్తోజయాస్యాత్॥

శ్లో॥ లక్ష్మీనాథాఙ్ఘ్రిపద్మ ప్రవణసుజనతాః స్వాత్మభోగాఖ్య మోక్షే సక్తానైశ్వర్యలుబ్ధానపిచ నిజసమాజాన్వయాయా జుహావ । ఆహూతాస్తే స్వసఙ్గం సకుతుకమవదన్తైస్సమేతోఽథసూరిః భద్రాణ్యాశాస్తచేతి త్రిభిరపి విషయైః పూరితోఽయం ప్రబంధః ॥

(తాత్పర్య సంగ్రహము) శ్రీవిల్లిపుత్తూరున నవతరించి తులసీవన కైంకర్య నిరతులయిన పెరియాళ్వార్ వార్లు భగవదాజ్ఞమీద పాండ్యరాజు సదసునొంది పరతత్వ నిర్ణయముఁ గావించిన ఐతిహ్యము జగత్ప్రసిద్ధము. పిమ్మట నారాజు పెరయాళ్వార్ వారులను ఏనుగు మీద నెక్కించి నగర ప్రదక్షిణము చేయించెను. అప్పుడు భగవంతుడు పిరాట్టితో గరుడారూఢుడై సేవసాయించెను. వారిని సేవించి యాళ్వార్ వార్లు భక్త్యాధిక్యంబుచే నిట్టి దివ్య మంగళ విగ్రహంబునకు నేమికీడు మూడునో యని యస్థాన భయశంకచే సపరికరులయిన భగవంతునకు మంగళా శాసన ముచేయుచున్నారు మొదటి రెండు పాశురంబుచేత. * ఏకః స్వాదు న భుంజీత * అను న్యాయానుసారము తామొకరై యీ దివ్యమంగళ విగ్రహము ననుభవించుటకు మన సొప్పక ముముక్షులను కైవల్యార్థులను ఐశ్వర్యార్థులను కూడ పిలిచి వారితో గూడ భగవంతుని యనుభవించి సంతసించుచున్నారు. * వాళాళ్ పట్టు సిన్నీర్ * అని ముముక్షువులను మూడవ పాశురంబుచేతను, * ఏడునిల త్తిల్ * ఇత్యాదిచే కైవల్యార్థులను * అణ్డక్కులత్తుక్కు * త్యాది పాశురంబుచే భ్రష్టైశ్వర్యకాములు అపూర్వైశ్వర్యకాములని రెండు విధంబుగానుండు ఐశ్వర్యార్థ

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



లను పిలిచిరి. ఇట్లు పిలిచిన వీరందఱును ౬-౭-౮ పాశురంబులచే క్రమముగా ప్రత్యేకముగా వచ్చి చేరిన రీతిని వారి వాక్యంబు చేతనే చెప్పుచున్నారు. ౯-౧౦-౧౧. పాశురములచే ప్రత్యేకముగ వారలతో గూడి భగవంతునకు మంగళా శాసనము చేయుచున్నారు. ఇట్లు మూడు విషయంబులు నిండియుండు నదీ దివ్య ప్రబంధము.

---

# పెరియాళ్వారు తిరుమొழி.

కంచి. అణ్ణంగరాచార్యులు సాయించిన
సటీక సారసంగ్రహ శ్లోకమాలిక.



౧. ౧. [వణ్ణమాడఙ్గళ్ ......]

శ్లో. శ్రీమన్నారాయణే ప్రాక్ పరమకరుణయా నందగోపస్య గేహమ్ సంప్రాప్తే కృష్ణమూర్త్యా నిరవధికముదా తత్రగోపాలబృందైః । సోత్సాహైః కల్పితానాం వివిధ బహుల నృత్తాదికోలాహలానామ్ వ్యాఖ్యానేనాతిహృష్టః మునిరధివసతాద్విష్ణుచిత్తో మనో మే॥ ౧॥

* ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః। నాగపర్యఙ్కముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్॥ * అను రీతిగ మధురాపురంబున దేవకీ వసుదేవులకు కంసుని చెఱసాలలో నవతరించి నిర్హేతుక పరమకృపచే గోకులంబున నందగోపగృహంబున నివసించుచుండెను కృష్ణుడు. అపుడు గోపులందఱును అమితోత్సాహంబుచే ఆడుచు పాడుచు పలువిధంబు

లయిన కోలాహలంబులను చేసిరి. వారి కోలాహలంబు నంతను మొదటి తిరుమొళిలో ననుభవించి యానందించిన పెరియాళ్వార్లు నామనంబున వసింతురుగాక.

పై శ్లోకము ఈ తిరుమొళి పది పాశురంబులకును సంగ్రహము. ఇటులే ప్రతిపాశురంబునకును ఒక్కొక శ్లోకము రచింపబడియున్నది. వానినన్నింటిని ఈ మొదటి తిరుమొళిలో మాత్రము ఉదాహరణంబుగ సూచించుచున్నాము. అన్నిటిని ప్రదర్శించినచో గ్రంథ విస్తరంబగునని మధ్యే మధ్యే ఇట్లు అవశ్యమయిన స్థలములయందు మాత్రము పూర్తిగా శ్లోకములు చూపబడును.

౧. [వణ్ణమాడఙ్గళ్.]

సద్వర్ణాంచిత సౌధమండలలసద్గోష్ఠీపురాధీశ్వరే
కృష్ణస్వామిని కేశవే గుణగణైః పూర్ణేऽవతీర్ణే సతి।
తైలం చూర్ణయుధో మిథః సకుతుకం వ్యాకీర్ణమాత్మస్వతాం
చేష్టాభిః బృహదఙ్గణం తదభవత్ జంబాలజాలాకులమ్॥ ౧॥

మంచి వర్ణంబులుగల మిద్దెలు మేడలు ప్రాకారంబులు చుట్టు కొనియుండు తిరుకోట్టియూరిలో భగవంతుడు శ్రీకృష్ణ రూపంబు దాల్చి యవతరించి నంతనే ఆనందాధిక్యంబుచే గోపకులు నూనె చూర్ణము వీనిని ఒండొరులు వెదచల్లుచుం డుటవలన నాయింటి ముంగిలియంతయు బురదయాయినది. ౧॥

(౨) ఓడువార్ విళువార్. . .)

శ్లో॥ ధావద్భిశ్చ పతద్భిరప్యథమిథః సానందసంశ్లేషణం

కుర్వద్భిశ్చ గవేషయద్భిః అధిపః కుత్రాऽస్మదీయస్త్వితి ।
పృచ్ఛద్భిః కృతగీతిభిః సపటహాోద్ఘోషంచనృత్తంముహుః
కుర్వద్భిశ్చ జనైర్మిలత్కలకలా గోపాలవాటీ బభౌ॥ ౨॥

కృష్ణావతారమునువిన్నంతనే ఆనందాధిక్యంబుచే కొందఱు పరుగిడిరి. కొందఱు పడిరి. మఱికొందఱు ఒండొరులను కౌగలించుకొనిరి. కొందఱు నాస్వామి యెచటనున్నారని యడుగుచుండిరి. మఱికొందఱు వెదకుచుండిరి. కొందఱు పాడుచుండిరి. కొందఱు పటహవాద్యమును (తప్పెట) వాదించుచు నర్తించిరి.ఇట్టిచేష్టలచే గోకులమంతయు కోలాహలంబుగానుండె.

3. పేణిచ్చీరుడై ...

శ్లో॥ సంపత్సంభృత నందనందన శిశుం జాతం నిగూఢాత్మకమ్
ద్రష్టుం గోష్ఠముపాగమన్ సుబహవో దృష్ట్వాబహిర్నిర్య
యుః।పుంస్త్వం లోకవిలక్షణం నిరుపమం చాస్యేత్యుపా
వర్ణయన్ శ్రోణర్క్షోదిత విష్ణులోకమఖిలం రక్షేదసావిత్యపి॥ 3

భగవంతుడు సర్వేశ్వరత్వ సూచకమయిన తన స్వరూపమును మఱుగుపుచ్చుకొని యవతరించిన యీ గోపాలబాలుని చూచుటకు అనేకులు వచ్చిరి. చూచి బయటవచ్చిరి అనేకులు. వీని పుంస్త్వము విలక్షణముగానున్నది. సమము లేకుండునది. శ్రవణ నక్షత్రంబున నవతరించిన విష్ణువునకు శేషమయిన యీయుభయ విభూతినంతయు నితడొకడే నిర్వహింపగలడు. ఇత్యాది రీతులం జెప్పుచునుండిరి యనేకులు. 3॥

(४) ఉఱియై ముఱ్ఱత్తు:—

శ్లో॥ శిక్యస్థాన ఖిలాంశ్చ భాండనివహాన్ముల్లోల్య గేహాంగణే

నృత్తంచక్రురథో ఘృతం దధి పయోవ్యాకీర్ణమాతేనిరే।
వ్యావల్గత్కచబంధనం విదధతస్నాటోపనాట్యోత్కరం
ప్రజ్ఞాలోపమవాపురప్యహహా! తే గోపాలవాటీజుషః॥ ౪॥

కృష్ణు డవతరించిన సంతోషాధిక్యంబుచే గోపులందఱును ఉట్టిలో నుండు పెరుగు పాలు నెయ్యి వెన్న మున్నగు వాని నన్నిటిని ముంగిలో బోర్లించి పలు విధంబుగా నాడుచు మైమఱచి యుండిరి. ౪॥

(౫) కొండతాళుటె:—

శ్లో॥ జాత్యుచిత శిక్యగణకుంత లగుడాదీన్
తాళదళతల్పనివహాంశ్చ దధతస్తే।
వల్లవజనాః వికచ సత్కటజదన్తాః
సంఘశ ఉపేత్య ఘృతనృత్తమథ చక్రుః॥ ౫॥

జాత్యనురూపముగా చక్రములను ఆయుధ విశేషములను దండములను తాటాకులచే నల్లిన తల్పములను ఎత్తుకొని అత్యానందంబుచే నవ్వుచు ఘృతనర్తనము చేసిరి. ఘృతనర్తనం బనగ:—సంతోషాతిశయంబుచే యభ్యంగనము చేసుకొని ఒకరి కొకరు కౌగలించుకొని చేయునర్తనము. ౫॥

(౬) కైయుమ్ కాలుమ్:

పాణిపాదమున్నమయ్య భాండతీర్థసేచనం
మందమంగమారచయ్య రమ్యయా హారిద్రయా।
జిహ్వికావిశోధనే దదర్శ సా జనన్యహో!
విస్తృతే కృతే ముఖే శిశోర్జగన్తి సప్తచ॥ ౬॥
శ్రీకృష్ణుని స్నానము చేయించునపుడు యశోదాదేవి

వాడుక ప్రకారముగా నోడలంతయు పసుపును బూసి మంచి వాసనాద్రవ్యములు చేర్చి కాచిన తీర్థమున స్నానము చేయించి జిహ్వానిర్లేహనము (నాలికను శోధించుట) చేయుటకై నోటిని తెఱచినపుడు అకృష్ణుని ముఖమున సప్తలోకములను చూచెను.

౭. వాయుళ్ వైయగమ్:—

శ్లో. శ్రీకృష్ణస్య శిశోర్ముఖే నిఖిలలోకాలోకనాద్విస్మితాః
సర్వే స్త్రీనివహాః స్వహర్షమవదన్ నాయంహిగోపాత్మజః
దివ్యం దైవతమద్వితీయమ్ అనఘైఃపూర్ణోగుణైఃకీర్తిమాన్
అత్యాశ్చర్యవిచేష్టితాదిభణితశ్చేత్యేవముచ్చావచమ్ ॥ ౭॥

శ్రీ కృష్ణుని నోటిలో సమస్త లోకంబులను చూచి యశోద అతిశయించి గోపికల నందఱను పిలిచి చూపించె వారందఱు దీనినిచూచి, 'వీడు సాధారణ గోపబాలుడుగాడు. అద్వితీయుడయిన భగవంతుడే. సమస్త కల్యాణగుణ పరిపూర్ణుడు. అత్యద్భుత చేష్టితకారియయిన భగవంతుడే యిట్లు అవతరించె. అని చెప్పిరి. ౭॥

౮. పత్తునాళుఙ్కడన్ద:—

శ్లో॥ అథో దశసు వాసరేష్వపి గతేషు గోపాలకాః
పరేద్యవి సమన్తతో విజయతోరణస్తంభకాన్।
నివేశ్య పరిమండితాన్, తత ఉదూఢగోవర్ధనం
శిశుం కరతలోత్సవానుభవతో హ్యుపాలాలయన్॥ ౮॥

ఈశిశువునకు నామకరణము చేయవలసిన దినము ప్రాప్తమయ్యె. అప్పుడు గోపులందఱును అంతట జయస్తంభమును నాటి అలంకరించి శ్రీకృష్ణుడను నామకరణంబు గావించిరి.

గోవర్ధన పర్వతంబునెత్తిన యీ కృష్ణునినెత్తుకొని బుజ్జగించి యానందించిరి. మనుస్మృతిలో *దశమే ద్వాదశేవాపి నామ జాతస్య కారయేత్ * అని చెప్పి యుండుటచే నామకరణ కాలంబున జరుగని గోవర్ధనోద్ధరణ వృత్తాంతమును అనువదించుట యెట్లు సంభవించునని కొందఱు ఆక్షేపింతురు. నామకరణ కాలంబున నీవృత్తాంతము జరుగకుండినను ఆళ్వారుల కాలమున జరిగియుండుటచే ఆళ్వారులు అనుభవించుటన్యాయమే.

## ౯. కిడక్కిల్ తొట్టిల్:—

శ్లో॥ పదాఘాతైస్తల్పం శిథిలయతి శయ్యామధివస
కటిస్థానే పీడాం జనయతి ధృతస్సన్ శిశురసౌ ।
సమాశ్లిష్టో గాఢం జఠర మభిహన్త్యంఘ్రితలతః
సఖి! క్లిశ్యే సాహం శిశునియమనే శక్తివిరహాత్ ॥ ౯॥

యశోద శ్రీకృష్ణునిచేష్టలను తన సఖితో చెప్పుచుండు రీతిని అనుభవించుచున్నారు. నజ్గాయ్! (సఖి!) అని జాత్యేక వచనము. సఖులారా! అని యర్థము. ఈశిశువు తొట్టిలలో విడిచినంతనే అది చినుగునట్లు కాలిచేగొట్టును. మృదువయిన పాదంబునకు నొప్పి గలుగునే యని యెత్తుకొన్నచో మెల్లగ జాఱి జాఱి దుస్సహమయిన పీడలు గల్గించుచున్నాడు. వీడొక విధముగను చేష్టచేయకుండునట్లు ఱొమ్మున నెత్తుకొని కౌఁగ లించుకొన్నచో కాలిచే కడుపుమీద దన్నుచున్నాడు. ఇట్లు వీడు చేయుచేష్టలను ఓర్వలేక నేను మిక్కిలి బాధపడుచు నున్నాను. (అని యశోదభావనచే ఆళ్వారు సాయించిరి.) ౯॥

౧౦. శెన్నెలార్ వయల్ శూழ்:—

శ్లో॥ సస్యోదక్షిప్తభూమి భాగవిలసద్గోష్ఠీపురాధీశితుః
శ్రీనారాయణ నామకస్య సుగ న్ధైః పూర్ణస్య జన్మోత్సవమ్।
ఉద్దిశ్యోజ్జ్వలయజ్ఞసూత్రసహిత శ్రీ విష్ణుచిత్తోదిత
శ్రీగాథాదశకం ముఖే కలయతాం పాపక్షయో నిశ్చితః॥

ఫలశ్రుతి పాశుర మిది. సస్యములు నిండియుండు తిరు కోట్టి యూరను దివ్యదేశనిర్వాహకుడయిన సర్వేశ్వరుడగు కృష్ణునియవతారోత్సవంబును గూర్చి బ్రాహ్మణోత్తములయిన పెరియాళ్వారులు పాయించిన యీపదిపాశురంబులను అనుసంధించువారలు భగవదనుభవవిరోధియయిన సమస్త పాపంబులును తొలగి సుఖముగా నుందురు అని.

ఇంతటితో మొదటి తిరుమొழிలో అన్ని పాశురంబుల కును శ్లోకానువాదము చెప్పబడియె. ఇక నొక్కొక్క తిరు మొழிకిని సంగ్రహ శ్లోకము మాత్రము ప్రకటింపబడును. ౧౦

౧-౨. శీదక్కడలుళ్.

శ్లో॥ దేవక్యా ధన్యయాఽత్ర ప్రహితముపగతం కృష్ణసంజ్ఞం కిశోరం సర్వాంగీణాభిరూప్యప్రచురమనుపమం వీక్ష్య సంమోదమానా। ఆహూయాశేషగోపీః స్వసుతపదసరో జాదికేశాంతశోభాం వ్యాచక్రే స్మ యశోదేత్యుదితముదితహృత్ విష్ణుచిత్తో గతిర్నః॥ * ఆకంఠవారిభరమంధర మేఘదేశ్యం పీతాంబరం కమలలోచన పంచహేతి। బ్రహ్మాస్తనంధయమయాచత దేవకీ త్వాం శ్రీరంగకాంత! సుతకామ్యతి కాపరైవమ్॥ ౨

(శ్రీరంగరాజ స్తవము.) అనురీతిగా ధన్యురాలయిన దేవకి ప్రసాదించిన శ్రీకృష్ణుని సర్వాంగ సౌందర్యంబును తాను తృప్తియగునంతవఱకు అనుభవించి ఆయానందాతిశయంబుచే గోపికల నందఱను పిలిచి తనపుత్రుని పాదాది కేశాంత సౌందర్యంబును వర్ణించిన రీతిని అనుభవించి సంతుష్టులయిన పెరియాళ్వారులే మనకు గతి.

ఈ తిరుమొழிలో నిరువది పాశురములుగాన నీపత్తులో (శతకము) తొమ్మిది దశకములు మాత్రమే గలవు. పాదము, పాదాఙ్గులి, పిక్క, మోకాలు, తొడ, లింగము, మొల, నాభి, కడుపు, ఱొమ్ము, అంసము, కరము, కంఠము, అధరము, ముక్కు, కన్ను, కనుబొమ్మ, మకరకుండలము, నొసలు, చిగురు ఇవి క్రమముగా నిరువది పాశురములలో ననుభవింపబడియె. ౨

౧-3. మాణిక్కజ్కట్టి:—

శ్లో॥ డోలాయాం శాయయిత్వా మణినిభవపుషం కేశవం సా యశోదా వేధాః శంభుర్మరుత్వాన్ అమరసముదయః యక్షరాజః ప్రచేతాః। పద్మా ధాత్రీచ వాణీ తలిమ మథచ సద్భూషణాన్యాదరేణ ప్రాహిణ్వన్నిత్యగాయత్ తదిదమభి దధద్విష్ణుచిత్తోఽవతాన్నః॥ 3॥

యశోద కృష్ణుని తొట్టెలలో పడవైచి అతడు నిద్రించుటకై పాటలు పాడెను. అప్పుడు, బ్రహ్మదేవుడు మంచి యొక తొట్టిలను సమర్పించె. రుద్రుడు ఇంద్రుడు దేవతలు కుబేరుడు వరుణుడు శ్రీదేవి భూదేవి వీరు పలువిధంబులయిన ఆభరణంబులను సమర్పించిరి. సరస్వతి లేక దుర్గాదేవి అంజనాదికమును

సమర్పించె అని పాడిన పాటను అనువదించిన పెరియాళ్వార్లు మమ్ములను కాపాడుగాక. 3.

౧-౪. తన్ముగత్తు:—

శ్లో॥ చంద్రాహ్వానాఖ్యబాల్యోచితకృతినిరతం కృష్ణమాదాయ కట్యాం భోచంద్ర! త్వం కిమంధః? కిము నను బధిరో! బాలకస్యాస్య లీలామ్। నో పశ్యస్యాదరో త్తిం న నిశమయసిహో దండ్యసే నాగతశ్చేత్ ఏహ్యత్రేత్యాహ మాతేత్యభిహితవతి మే విష్ణుచిత్తే రతిః స్యాత్॥ ౪॥

శ్రీ కృష్ణునికై యశోద చంద్రుని పిలుచుట.

కృష్ణునకు తొట్టిలపరువము దాటె. ఆటాడు పర్వము ప్రాప్తమయ్యె. అప్పుడు దుమ్ములో నాటాడుచు నుండిన వీడు లౌకిక బాలకునివగిది చంద్రునిచూచి పిలువనారంభించె. దానిని జూచి యశోద కృష్ణుని యెత్తుకొని 'ఓ చంద్రుడా! నాకొమరు డెంత పిలిచినను ఏల రాకున్నావు? నీవు చెవుడా? వీని యాటలనుకూడ చూడకున్నావే? నీవుగుడ్డివా? నిన్ను ఆదరముతో పిలుచుచున్నాడే. అట్లుండియు నీవు రాలేదు. చిన్న పిన్నవాడు గదా యని యుపేక్షించుచున్నావు గాబోలు. ఈవిషయమును మహాబలిచక్రవర్తిని అడిగినచో తెలియగలదు. నీవు రాకుండినచో దండింపబడుదువు. ఆభయముండినచో వెంటనేరాగలవు' అని యశోద చెప్పిన రీతిని అనుభవించిన విష్ణుచిత్తునియందు భక్తి స్థిరముగానుండుగాక. ౪॥

(౧-౫) ఉయ్య ఉలగు:—

కృష్ణుని నటనమును చూడవలయునని యశోద ప్రార్థించుట.

శ్లో॥ బాల్యే మాతా తథాఽన్యై కిమపిచ నటనం కారయ

న్తే శిశూనాం శెఙ్గీరై నర్తనం తత్త్వ భిదధతి బుధా ద్రావిడీవర్త్మ విజ్ఞాః । తత్కృష్ణే కారయన్తీ నటనటతనయే త్యుద్గృణానా యశోదా నానాస్తోత్రోక్తి బృందైస్సహ ముదమభజత్, తద్వదర్ణ సూరిరీడ్యః ॥ ౫॥

ద్రావిడ భాషలో 'శెఙ్గీరైనర్తన'మని యొక బాల్యక్రీడ గలదు. శెఙ్గీరైనర్తనమనగ తల్లి మున్నగువారు బిడ్డను తామే యాడించు నొకవిధమయిన యాట యని కొందఱు. బిడ్డ తన రెండుచేతులను మోకాళ్ళను ఊని తలను పై కెత్తుకొని దోగాడు కాలమున నాడునాట యని మఱి కొందఱు. ఆయాటను చూడ గోరి యశోద కృష్ణుని పలువిధంబుగా నుతించి 'ఈవిధంబుగా నాడుము, ఈవిధంబుగా నాడుము' అని చెప్పుచు సంతసించిన రీతిని అనుభవించిన పెరియాళ్వారులను నుతింతము. ౫.

(గొబ్బిళ్ళుతట్ట పిలుచుట)

౧-౬. మాణిక్కిక్కిణ్గిణి:—

శ్లో॥ పాణ్యోస్సాహిత్యకృత్యా విదధతి శిశవః ఖేలనం, తచ్చ కృష్ణేమాతా సంద్రష్టుకామా మణినిభ! సుమచ త్వత్పితు శ్చాఙ్కభాగే। ఆగత్యాగత్య హర్షాత్ప్రకలయ సహపాణ్యాహ్వయం క్రీడితం త్వం పాణిభ్యాం సేతుకృద్భ్యామితి కథితవతీత్యూచివాన్ సూరిరీడ్యః ॥ ౬

ద్రావిడ భాషలో "శప్పాణి" యని యొకటి గలదు. సహపాణి యను సంస్కృతపదము శప్పాణి యని మాఱినది. గొబ్బిళ్ళు అని దానిని మనభాషలో వ్యవహరింతురు. ఆ యాటను చూడగోరి 'కృష్ణా! నీవు మాయయందును నీతండ్రియం

మను గూర్చుండి మాతో గొబ్బిళ్ళు తట్టుము' అని ప్రార్థించు చున్నది. 'నీచేతులే గదా పూర్వము సేతుబంధనము గావించి నది?' అని ప్రార్థించిన రీతిని అనుభవించిన పెరియాళ్వారులను నుతింతము. ౬.

౧-౭. తొడర్ శజ్గిలికై.

(కృష్ణుని స్ఖలితగతిని చూడగోరుట)

శ్లో॥ సస్ఖాలిత్యా గతిర్యా శిశుషు భువి జనైః దృశ్యతే తాం
యశోదా కృష్ణే సంద్రష్టుకామా, కలభ ఇహాయథాఽఽ
యాతి తద్వన్ముకుంద । ఏహి స్ఖాలిత్యగత్యా తనుగతమ
ఖిలం భూషణాం సాదయన్ సన్ సాకంరామేణచేతి న్యగద
దితి గదన్ విష్ణుచిత్తో గతిర్నః ॥ ౭॥

బిడ్డలు నడవ నారంభించు నపుడు కాలిని దృఢముగా పెట్టలేకుండుటచే రెండడుగులు పెట్టుట క్రిందపడుట తిరిగి లేచుట పడుట ఇట్లుండుట వాడుక. అట్టిగతిని చూడగోరి యశోద 'ఓముకుందా! ఏనుగుపిల్ల నడచునట్లు దివ్యభూష ణములు శబ్దింప నీయన్నయయిన బలరామునితో గూడ నడచి వచ్చి నన్ను సంతసింపజేయుము' అని ప్రార్థించిన రీతిని యనుభ వించిన పెరియాళ్వారులు మనకు శరణము. ౭.

౧-౮. పొన్నియల్ కిణ్కిణి.

(దూరముననుండి వచ్చి కౌగలింపగోరుట)

శ్లో॥ బాలా ఆధావ్య దూరాత్సరభస ముపసృత్యాథ మాతు
శ్శౌరీ రేగాఢాశ్లేషం దదానాః కమపి కమపి చానందముత్పా
దయన్తి। ఏతంచానందమాప్తుం ద్విజసుతమభియాచ్యాక్షి

సా సంప్రహృష్టా ధన్యాఽఽసీత్సా యశోదా తదిదమభిద
ధద్విష్ణుచిత్తోఽతిధన్యః ॥ ౮

బిడ్డలు తల్లిమెడ నెక్కుటకై వేగముగా దూరము నుండి వచ్చి తల్లిమీద నెక్కి గట్టిగా కౌగలించుకొని విలక్షణా నందమును గల్గించుట యనుభవసిద్ధమయిన విషయము. ఇట్టి యానందంబు ననుభవింపగోరి యశోద కృష్ణుని పలువిధం బుగా స్తోత్రముచేసి ప్రార్థించినరీతి ననుభవించిన పెరియాళ్వార్లు ధన్యులు. ౮

౧-౯. వట్టునడువే.

(కృష్ణుడు కౌగలింప నానందించుట.)

శ్లో॥ బాలాలంకారభూషాఞ్చితమృదుతనునా కృష్ణడింభేన శశ్వ
త్ దూరాదాగత్య మూత్రస్రుతితతిసహితం పృష్ఠభాగే
ప్రదేయమ్। కంఠాశ్లేషం ప్రకాజ్‌క్ష్య ప్రమదమనుపమం
ప్రాప్తవత్యా జనన్యా తత్ స్తోత్రం యద్యదుక్తం తదభిహి
తవతా సూరిణాఽహం సనాథః ॥ ౯

బిడ్డలు దూరమునుండి వేగంబుగావచ్చి వెనుక నిలిచి కౌగలించుకొని ఆటాడుట ప్రసిద్ధము. అట్టియాట నాడ యశోద ప్రార్థించుచున్నది. అట్లాటాడునపుడు గలుగు ఆభరణ ధ్వనియు మూత్రముకాఱుటయు పరమపావనంబుగాన నవికూడ ప్రార్థింపవలసినచ్చె. ఇట్లొనర్చిన యశోదాదేవియొక్క భావ మును అనుభవించిన విష్ణుచిత్తులే నాకు నాథులు.

పెరియాళ్వారు తిరుమొళిలో మొదటి పత్తు సంపూర్ణము.

---

# రెండవ పత్తు.

## ౨-౧. మెచ్చూదు శజ్గమ్.

(కృష్ణుడు బూచి చూపించి యాడుటను గోపికలు చెప్పుట.)

శ్లో॥ బాలాఃకుర్వన్తి దృగ్భ్యాం కిమపి విహరణం భీషణం
వ్యాఘ్రశాణాం తద్వత్ కృష్ణోఽపి గోపీష్వకురుతనిజ ది
వ్యాయుధఖ్యాపనేన। ప్రోచుర్గోప్యస్తదాత్వే తదిదమతిభి
య్యా, తత్తగ్దానుశంసన్ సూరిః శ్రీవిష్ణుచిత్తః విలసతు
హృదయేమామకే ధ్వాన్తహారీ॥ ౧౦

బాలురు తెప్పలను పైకెత్తివేసికొని వెంద్రుకలను కన్నులవఱకు ముడివేసుకొని చిన్నపిల్లలను భయపెట్టుట యను నొక యాటగలదు. ఇట్టి చేష్టలను గోపికలయందు చేసెనని వారివచనంబు ననువదించుచున్నారు. * అప్పూచ్చి కాట్టుగిన్ఱాన్ అమ్మనే అప్పూచ్చికాట్టుగిన్ఱాన్ * అని ప్రతి పాశురముయొక్కయు నాలుగవ పాదము. అమ్మా! వీడు భయ పెట్టుచున్నాడు, మాకు భయముగా నున్నది అని భావము. లోకమున భయపెట్టిన విధంబును మాత్రము చెప్పలేదు. కొందఱ యభి సాధారణముగా బాలురు చేయునట్లు చేసెనని కొందఱ యభి ప్రాయము. శ్రీరజ్గమున అధ్యయనోత్సవకాలమున మొదటి యుత్సవమున అభినయము చూపించుకాలమున 'ఉయ్న్దపిళ్లై' యనునరైయరు ఈదశకము నభినయించునప్పుడు సాధారణముగా బాలురుచేయు విధముగా (అనగా తెప్పలుతిప్పుకొనుట, వెంద్రు కలను ముడివేసుకొనుట) అభినయించె. అగోష్ఠిలో ఉడైయ

వరుల వెనుకనుండిన ఎంబారు దీనిం జూచి 'అరసికులీ యరై యరు' అని దలంచి నేలువిధంబుగా నభినయంబును వెనుక కూర్చుండియే అరైయరులకు సూచింపజేసె. ఇంగితమును దెలిసికొనిన యరైయరు తిరిగి శంఖచక్రములను ధరించిన ట్లభిన యించె. అప్పుడు ఉడైయవర్లు 'ఎంబారున్నారా?' అని తిరిగిచూచి సంతసించినట్లు ఒక ఐతిహ్యమీవ్యాఖ్యానంబున గలదు. దాని భావము:—కృష్ణుడవతారకాలంబున దివ్యా యుధంబులతోనే యవతరించిరి. * ఉపసంహర సర్వాత్మన్ ! రూపమేతచ్చతుర్భుజమ్। జానాతు మావతారం తే కంసోయం దితిజన్మజః * అను దేవకీ వసుదేవుల ప్రార్థనంబువిూద నాయా యుధంబులరు ఉపసంహరించుకొనిరి. అట్లుపసంహరించుకొనిన ఆయుధములను గోపికిచూపించె. ఇట్టి రూపంబు ౦౭ తవటకు జూడనిగోపి చూపించినంతనే భయపడె. అసి. ౧౦

౯-౨. అరవణైయాయ్.

(యశోద కృష్ణుని స్తన్యపానంబునకై పిలుచుట)

శ్లో॥ వీథ్యాం స్వైరం చరన్తం భయలవవిధురం నందనం నంద పత్నీ, హాకృష్ణ స్వైరమేవం విహరణముచితం నైవ తే వీథికాసు। కాలే స్తన్యం న పేయం కిము కఠినహృదః కంసదైత్యస్య దౌష్ట్యం శంకాం దత్తే,తదేహీత్యకథయదితి తత్ ప్రోచివాన్ సూరిరీడ్యః॥ ౧౧

కృష్ణుడు పగలంతయు నాటాడి యలసి రాత్రి స్తన్య ముగుకూడ మఱచి నిద్రించె. ఉదయమున యశోద పలువిధం

బుగా స్తోత్రముచేసి మేలుకొలిపె. మేలుకొనియు పాలుత్రాగక వీథిలో నాటాడపోయె. అదిచూచి యశోద 'అబ్బా! దుర్బుద్ధి యయిన యాకంసుడు నిన్ను చంప మాటిమాటికి రాక్షసులను పంపుచునుండు విషయము ప్రసిద్ధము ఇట్టి సమయంబున నీవు నిర్భయముగా వీధిలో తిరుగుచుండుట యనుచితము. కాల మున స్తన్యము కుడువవలదా? విచ్చలవిడిగ తిరుగవలదు. నీచేష్టితంబుల నన్నింటిని నాయొడిమీద ప్రదర్శించుచు స్తన్యమును కుడుచుచు నన్నానందింపజేయుము అను యశోదా వచనంబుననుసంధించిన పెరియాళ్వారులను నుతింతము. ౧౧

## ౨-3. పోయ్ప్పాడుడైయ.

(యశోద కృష్ణుని కర్ణవేధనంబునకై పిలుచుట.)

శ్లో॥ శ్రీకృష్ణే కర్ణవేధం కలయితుమధికోత్కంఠితా దివ్య మాతా తస్యోక్త్వా కేశవాదిద్వ్యధికదశమహానామ వర్గం సుభోగ్యమ్ । జంబూముఖ్యం ప్రదద్యాం ఫలమతి మధురం మాస్మరోదీస్సుఖం తే భూయాదిత్యాజుహావేత్య భిదధతి మునౌ విష్ణుచిత్తేఽస్మి భక్తః ॥ ౧౨

యశోద కృష్ణునకు కర్ణవేధోత్సవంబు చేయదలంచి గోకులంబుననుండు గోపికలనందఱను బిలిచి, తాంబూలాదు లను సిద్ధపఱచి 'కృష్ణా! కర్ణవేధోత్సవంబునకై రమ్ము సుమా, చెవులను పొడుచునప్పుడు కొంచమయినను నొప్పి యుండదు. ఇచటనుండు గొల్లపిల్లలందఱును మకరకుండలములను ధరించి యున్నారు. నీవు నటులే వేసుకొనవలదా? ఏడవకుమా. నీకిష్టములయిన నేరేడుపండు పనసపండు మున్నగువాని నిచ్చెద.

శీఘ్రముగా రమ్ము సుమా అని యశోద చెప్పిన వచనంబులను అనుభవించిన పెరియాళ్వారులకు భక్తులుగా నుందము. ఈ తిరుమొళిలో ప్రతిపాశురములలో నొక్కొక నామముచొప్పున ద్వాదశనామములు క్రమముగా నున్నవి. ౧౨

౨-౪. వెణ్ణెయళైన్ద.

(కృష్ణుని స్నానమునకై పిలుచుట.)

శ్లో॥ గోష్ఠేషు క్రీడనేన ప్రచురతరపరాగోప రాగం త్వదంగమ్
ద్రష్టుం వాంఛా గరిష్ఠా మమ, తదపి హసేత్ నీళయా సర్వలోకః । నైతచ్ఛక్నోమి సోఢుం తవ బహువితరాణ్యర్భక! స్వాదుభక్ష్యాణ్యాయాహి స్నాతుమిత్యాహ్వాయదథ జననీ విష్ణుచిత్తస్తదాచే ॥ ౧3॥

స్నానమునకై వలసిన సామగ్రులను సిద్ధపఱచి కృష్ణుని పిలుచుచున్నది యశోద:—కృష్ణా! స్నానమునకై యేతెంచుసుమా. ఈపల్లెలో నాటాడి నీ యొడలంతయు దుమ్ముగానున్నది.

చ॥ "వలగొని నాచుముట్టినను బాటిలు పంకజమింపుమీఱి, లోపల పెనుమచ్చ నిల్చినను భాసిలు చంద్రుడు నిగ్గుదేఱి,"

అనురీతిగ దూళినిండిన నీశరీరమును చూడ తహతహపడుచున్నాను. అయినను నిన్నుచూచిన వారందఱు నన్ను తిట్టుదురు. నిన్నీకోలమున నప్పిన్న చూచినచో పరిహసించును. కనుక వెంటనే స్నానముచేయ నేగుము. వచ్చినచో నీకు మంచి భక్ష్యముల నిత్తును అను ననుభవంబును పెరియాళ్వారులు అనుభవించెు.

౨-౫. పిన్నై మణాళనై :—

(కృష్ణునకు తలదువ్వుటకై కాకిని బిలుచుట.)

శ్లో॥ స్నాతం కృత్వాఽథకృష్ణం చికురభరపరిష్కారకృత్యే యశోదా సక్తా, లోకే తదర్థం బలిభుజ మఖిలా ఆహ్వయన్తీతి దృష్ట్వా। కృత్వాఽముష్యాన్యపర్యం సుకరతరమిదం కృత్య మిత్యాశయానా కాకం ప్రేమ్ణాఽఽజుహావేత్యుదితవచసి మే విష్ణుచిత్తేఽస్తు భక్తిః॥ ౧౪

కృష్ణుని స్నానము చేయించిన పిమ్మట తలను దువ్వవలసి వచ్చె. అందుకై వానిం బిలిచినను అతడు ఆటాడబోవ నారంభించె. అది చూచి యశోద వానిబుద్ధిని యాటనుండి మఱల్చుటకై కాకిని పిల్చుట మున్నగు కార్యములను చేయ నారంభించెను. అప్పుడు బిడ్డలు ఆటను మఱచి స్తబ్ధముగా నుందురు. అప్పుడే తాము చేయవలసిన కార్యములను బిడ్డలకు చేసి ముగింతురు. ఇది యనుభవసిద్ధము. ఇటులే యశోదకూడ చేసెనని యీ తిరుమొళిలో ననువదించుచున్నారు. * కుళల్ వారాయ్ అక్కాక్కాయ్ * (తలదువ్వ నేగుము కాక మా!) అని ప్రతి పాశురమునను గలదు. దీనిని చూడగా కాకమే తలదువ్వుచున్నదా యేమి? అను సంశయము గల్గును. వస్తుస్థితి యేమనగా కాకి వచ్చినచో కృష్ణుడు పరాఙ్ముఖముగా నుండును. అప్పుడు కార్యమును పూర్తికావించుకొనవచ్చును అనియే. కనుక కాకి తలదువ్వునట్లు చెప్పుట గౌణము. ౧౪

౨-౬. వేలిక్కోల్ వెట్టి

(పసువులను మేపుటకై కాకిని బెత్తము తెమ్మనుచున్నది.)

శ్లో॥ కృష్ణం గోపాలజన్మోచితకృతికుతుకాద్గోతతే శ్చార

ణార్ధస్ కాన్తారం యాతుకామం ఛలవచనబలాద్రోద్ధు
కామా యశోదా। గోసంచారార్హదణ్డం మమ తనయ
వరస్యాహరాద్యాశు కాకేత్యుచే శశ్వత్తదేతద్రస
ఘనవచనై ర్యాచివాన్ సూరిరీడ్యః॥ ౧౫

తల దువ్విన పిమ్మట పువ్వులను బెట్టదలంచె యశోద. అప్పుడే పసువులను మేపుటకై గొల్లపిల్లలందఱు పోవుచు నుండుటచే తానుకూడ వారితో బోవదలంచి దానికి దగిన బెత్తము నిమ్మని యశోదను నిర్బంధించెను. పువ్వులబెట్టి కన్నులార చూడగోరిన యశోద బెత్తము నివ్వక విలంబముచేయ నారంభించె. 'కృష్ణా! కాకి నీదండము నెక్కడనో పెట్టివేసె. వెంటనే దాని నెట్లు ఇవ్వగలను! కొంచముండుము. కాకిని బెత్తమును తెమ్మనిమెద' అని చెప్పి కాకిని పిలిచె. అది యీ తిరుమొఴిలో చెప్పబడుచున్నది. ఇట్లు యశోదాభావన ననుభవించిన ఆఴ్వారులను నుతింతము. ౧౫

౨-౭, [ఆనిరై మేయ్క్క నీపోది...]

(యశోద పుష్పము బెట్టుటకై కృష్ణుని బిలుచుట.)

శ్లో॥ స్నాతం సంపుష్టకేశం సుతమథ కుసుమాలంక్రియాథ్యం
చికీర్షుర్మాతా చామ్పేయమల్లీదమనకసురగపున్నాగమా
గధ్యభిఖ్యామ్। సజ్జీకృత్య ప్రసూన ప్రచయమభినవం, వత్స!
పుష్పాణి ధర్తుం ద్రాగాయాహీతి యాఞ్చామకృత, వదతి
తద్విష్ణుచిత్తేఽస్మి భక్తః॥ ౧౬

క్రిందితిరుమొఴిలో చెప్పినరీతిగా విలంబించుటచే కృష్ణుడు తన ప్రయాణమును మఱచియుండె, అప్పుడు వానికి

పలువిధంబులయిన పుష్పములను బెట్టి కన్నులార చూడగోరి యశోద సంపెగ-మల్లె-దవనము అడవిమల్లె జాజి మున్నగు పుష్పములను దెచ్చి 'కృష్ణా! ఈపుష్పములను ధరింపనేగుము' అని యాచించె. దానిని పదిపాశురంబులచే ననుభవించిన పెరియాళ్వారులకు భక్తులుగా నుందము. ౧౬

ఈ తిరుమొழిని ప్రతిదినమును సాయంకాలమున నన్ని సన్నిధిలోను సేవించుచు నుండుటచే ప్రతిపాశురమునకును శ్లోకమును ప్రకాశింతము.

౨-౭-౧. ఆనిరై మేయ్కక.

శ్లో॥ ౧. గాస్సంచారయితుం ప్రయాసి,నహి వేత్సి త్వత్ప్రభావం హరే! కాంతారే బహు సంచరన్ బత! వపుర్గ్లానిం సమాసీదసి। భాండే చూషసి దుగ్ధమిత్యహహ భో! మిత్రైతరై ర్హాస్యసే పీయూషాదపి భోగ్య! చంపకసుమం వోఢుం సమాగచ్ఛతాత్॥

ఓరీ చిన్నికృష్ణా! నీవు నీదివ్యదేహసౌకుమార్యంబు నెఱుంగక ఆవులను మేప నడవికి నేగుచునున్నావు. అడవిలో నంతట తిరిగితిరిగి నీ దేహమంతయు వాడిపోవును. ఇంటిలో నుండిన నిన్నునందఱు కుండలోనుండు పాలను త్రాగునట్లు పరిహసించినను పరిహసింతురుగాక. నీచేష్టలన్నియు మాకు పరమపావనముగాదా? అమృతంబున కన్న నతిభోగ్యమయిన వాడా! నీకు సంపెగ పుష్పములను పెట్టెదను. ఏతెంచుమా! ౧

(కరువుడై మేగజ్జళ్)

శ్లో॥ ౨. జీమూతో జలగర్భనిర్భరఇ వానన్దం దృశోర్వర్షయన్

సౌన్దర్యాఞ్చిత సర్వలోకవితతీరక్షార్థమత్రోదిత ।
లక్ష్మీనాయక రంగనామ్ని నిలయే శేషే శయాన ప్రభో
సౌగన్ధ్యాధికమల్లికాస్రజమిమాం వోఢుం సమాగచ్ఛభోః॥

శ్రీ కృష్ణా! నిన్ను జూచినప్పుడు, స్త్రీకాక్కారును చూచిన నెంత యానందముగల్గునో; అంతయానందము గల్గును. ఓరీ సుందరా! లోకమును రక్షింపనవతరించినవాడా! శ్రీరంగమున శయనించియుండువాడా! శ్రియఃపతీ! నెత్తావివచ్చు మల్లెపువ్వుంబును ధరింపనేగుమా! ౨

(పుచ్చొచ్చెడుమాళ్ళికై)

శ్లో॥ 3. ఆరుహ్యాప్రసభం మహత్తరగృహప్రాసాదదేశాదిషు
ప్రాప్య స్త్రీజనతాన్తికం శిథిలయన్ తచ్చోళచేలాదికమ్ ।
నిత్యం దుశ్చరితోత్సుక క్షితిధరే శేషాభిధే సన్ ప్రభో
వోఢుం సద్దమనంచ పాటలసుమంస్వామిన్ సమాగచ్ఛభోః॥

మెద్దెల మేడలయందునెక్కి అచటనుండు వనితల ఆవికలను వస్త్రములను చింపివేయుచున్నావు. ఎల్లప్పుడు నిట్టి దుండగంబులనే చేయుచునుండువాడా! వెంకటాచలపతీ! దమనంబును పాదిరి పువ్వములను ధరింప నేగుమా. 3

(తెరువిన్ కణ్ణిన్లు)

శ్లో॥ ౪. స్థిత్వా వీథిషు బాలగోపలలనాగోష్ఠీషు దుశ్చేష్టితం
సైర్వగంమాకురు నీలకేశలలితభ్రూరమ్యఫాలోజ్జ్వల ।
భాస్వన్మేఘశిశూపమేయసుషమాసంపూర్ణ కృష్ణప్రభో
వోఢుంసౌరభసంభృతం దమనకం శ్రీపల్లవంచాఽఽవ్రజ॥

సర్వాంగ సుందరుడా! మేఘమువంటివాడా! వీథిలో

నుండి గొల్లపిల్లలతో నాడక దుండగంబులను చేయకయుండుమా. దవనమును మరువమును ధరింపనేగుమా. ౮

(పుళ్ళినై వాయ్‌పిళన్దిట్టామ్)

శ్లో॥ ౯. వక్త్రంచైత్యబకస్య దీర్ణమతనోః దన్తంగజస్యాహరః
రాక్షస్యాఃకిలనాసికాం వ్యదసృజః రక్షఃపతించావధీః।
నాథ?త్వాం నవనీతజగ్ధిసమయే నిర్భీరహం ప్రాహారం
తత్త్వాస్తాం విమలాంబునిర్గతమిదం కల్హారముత్తంసయ॥

కృష్ణా! నీ ప్రతిచేష్టితంబులును అతిమనోహారంబుగా నుండును. భయంకరంబుగా నుండును. బకాసురుని ముఖమును చీల్చితివి. కువలయాపీడంబను నేనుంగుదంతములను విఱిచితివి. శూర్పణఖయొక్క ముక్కును కోసితివి. రావణుని చంపితివి. ఇట్టి నిన్ను వెన్నను దొంగలించితివని నిర్భయంబుగా గొట్టితినే. దానిని క్షమించుము. చెంగలువ పువ్వును ధరింప నేగుమా. ౯

(ఎరుదుకళోడు)

శ్లో॥ ౧౦. యుద్ధం దారుణమాతతన్థ వృషభైః గాత్రేవిరక్తోనిజే
స్వచ్ఛన్దంచ విచేష్టసే చరణతః కంసంప్రవహ్యాత్యాహరః।
రథ్యాయాం కటుచేష్టితాని కలయన్ మల్లైస్సమంయుద్ధమ
ప్యాధాయాఽగత! హేమరమ్య శిరసా పున్నాగపుష్పం హ॥

కృష్ణా నీలాదేవిని చేపట్ట సప్తవృషభంబులతో (ఏడు ఎనుబోతులతో) ఘోరయుద్ధము చేసితివి. నీదేహరక్షణమున నిసుమంతయు నిచ్ఛలేకున్నావు. విచ్చల విడిగ చేష్టలను చేయుచున్నావు. కంసుని కాలిచే దన్ని చంపితివి. మధురానగరం

బున వీధిలో రజకా (చాకలి) దులతో నాటాడి మల్లురతో పోరాడితివి. బంగరువువంటి దేహకాంతిగలవాడా సురపొన్న పువ్వులను ధరింప నేగుమా! ౬

(కుడక్కూత్తు)

శ్లో॥ ౭. కుంభానూర్ధ్వముపక్షిపన్ పటుతమం నృత్తం ప్రకుర్వన్ ప్రభో, గోపీశ్చన్ద్రసమాననాత్రీవదనాః వ్యామోహయన్ బాలక । వక్షోదైత్యపతేర్హిరణ్యకశిపోః ద్వేధావిభిన్దన్ ప్రభో, వోఢుంమూర్ధని కుంభఘోణశయనాఽఽయాహి స్రజం మాగధీమ్ ॥

కుంభనర్తన మనగ, రెండు భుజంబులందును శిరమునను కుండలను పెట్టుకొని రెండుచేతులతోను కుండల నెత్తుకొని ఆడు నొకవిధమయిన ఆట. ఈయాటను కృష్ణుడు తానుగోపాలవంశం బుననే పుట్టిన అసలు గొల్లడని అందఱు నమ్ముటకై చేయు చుండును. ఇట్లాడునపుడు ఏకుండయయినను కదలకయుండునట్లు ఆడుటయే సామర్థ్యము. ఈనర్తన సామర్థ్యమే మొదటి పాదం బున చెప్పబడియె. కుంభనర్తన సమర్థుడా! గొల్లెతలను మోహింపజేయువాడా! హిరణ్యాసురునివక్షంబును చీల్చినవాడా! కుంభకోణక్షేత్రమున శయనించి యుండువాడా! అడవి మొల్ల పువ్వును ధరింప నేగుమా. ౭

(శీమాలికనవనోడు)

శ్లో॥ ౮. మైత్రీం మాలికనామకేన కలయన్ దృష్ట్వాఽథతద్భూర్తతాంతంహన్తవ్యమవేత్యతస్యతుశిరో హేతీశ్వరేణాచ్ఛినః కార్యాకార్యవిశేషవేదనపటో శ్రీరంగశాయిన్ ప్రభో

మద్దుఃఖాపహా మాలతీస్రజమిమాం ధర్తుం సమాగచ్ఛభోః ॥

ఈపాశురంబున జాజిపువ్వును ధరింపజేయ నొక యద్భుతకథచే బిలుచుచున్నది. కృష్ణునకు మాలికుండను నొకానొక ప్రియమిత్రము గలడు. అతండు కృష్ణునియం దనేక విద్యలను అభ్యసించి మదించి గర్వించి భాగవతుల నందఱను తిరస్కరించుచునుండె. కృష్ణు డెంతజెప్పియు వినడయ్యె. ఎట్టకేలకు నతని నేరీతినయినను చంప నిశ్చయించి సమయము చూచుచునుండె. ఇట్లుండ నొకప్పుడు ఆమాలికుడు కృష్ణుని యొద్దకు నేగి తనకు చక్రాయుధంబును ప్రయోగించు విధంబును నేర్పింపగోరె. కృష్ణుం డెంత వారించియు వినక చక్రప్రయోగవిధంబును నేర్పింప నిర్బంధింపసాగె. కృష్ణుండును విని వీని నీ యుపాయంబుచే తుదముట్టింపనిశ్చయించి 'మాలికా! ఈచక్రాయుధప్రయోగవిధంబును చూడు మ' నిచెప్పి, చక్రమును ఆకాశంబునవేసి క్రిందపడునపుడు దానిని అవలీలగా బొటనవ్రేలితో ధరించెను. ఇదిచూచి మాలికుండును 'ఇది యెంతపని' యని తాను నామాదిరిగా జేయనారంభించె. అప్పుడు గిర్రరందిరుగుచువచ్చిన యాయాయుధము గుఱిదప్పి వానికంఠముమీద బడ నతండు కంఠము తెగిచచ్చె. ఈకథకు మూలము తెలియలేదు. శ్రీవిష్ణుపురాణముననో హరివంశముననో యీకథయుండునట్లు తెలియలేదు. వ్యాసపరాశర వాల్మీకులవలె ఆళ్వారులుకూడ ఈయైతిహ్యమును సాక్షాత్కరించియుందురని పూర్వులందురు. ౮

(అణ్డ త్తమరర్ కళ్)

శ్లో॥ ౯. దివ్యైస్సూరిగణైస్సమేత్య విలసన్నాస్థానసన్మణ్డపే
భక్తాన్తఃకరణే నివాసరసిక శ్రీరఙ్గరమావల్లభ ।
భుక్త్వాస్య త్తజగన్తి నిద్రితవారే న్యగ్రోధపత్రే క్వచిత్
మత్ప్రీత్యైయనను కారుమ్యకాఖ్యకుసుమంస్వామిన్ సముత్తంస య ॥

పరమపదంబున దివ్యమంటపంబున నిత్యముక్తులతో విరాజిల్లువాడా! భక్తులహృదయంబున నే వసించువాడా! ఏడు లోకంబులను మ్రింగి వటపత్రంబున పరుండితివి. కృష్ణా! నాకు సంతోషము గలుగ 'కరుముగై' యను పుష్పమును ధరింప నేగుమా! ౯

(శెణ్బకమల్లికై)

శ్లో॥ ౧౦. మల్లీచంపకహల్లకాదికుసుమాన్యాదాయ మాత్రా పురా స్వామిన్ ధర్తుమమూని సంప్రతి సమాగచ్ఛేతి సానన్దయా । యత్రాప్యభాషి యశోదయా తదుదితం శ్రీ ధన్వినవ్యాభిధ క్షేత్రాధీశ్వరభట్టనాథవిదుషా భక్త్యైక భోగ్యక్రమాత్ ।

ముల్లై మున్నగువానిని సిద్ధపఱచి వానిని ధరింప బిలిచిన యశోదయొక్కయనుభవంబు ననుభవించిన యాళ్వారులభాగ్యమే భాగ్యము. పూచ్చూడల్ ముగిసె.

౮. ఇన్దిరనోడుపిరమన్.

శ్లో॥ పుష్పాలఙ్కారరమ్యం సుతమతిసుషమం దృష్టిదోషాపనుత్త్యై, దీపేనాభ్యర్హణీయం మనసినిదధతీ భాగ్యమూర్తిర్యశోదా । ఆగచ్ఛ క్షిప్రమత్ర ప్రియసుత నబహిర్యాహి

కృష్ణేత్యవోచత్,తత్ శ్వేతాద్రీశ్వరం ప్రత్యభిదధదన ఘో విష్ణుచిత్తో వరేణ్యః ॥ ౧౭॥

యశోద కృష్ణుని స్నానముచేయించి తలదువ్వి పుష్పములను బెట్టి దృష్టిదోషపరిహారార్థమై తిరువందికాప్పు (సంధ్యా కాలమున రక్షకై మంగళదీపాదులచేచేయబడు శాంతి) చేయ బిలుచుచున్నది. కృష్ణా! ఇల్లు విడిచి బయట బోకుండుమా! సంధ్యాకాలంబున నెచటను నిలువకుండుమా! అని తిరు వెళ్ళఱై అను దివ్యదేశమున వేంచేసియుండువానినే కృష్ణునిగా భావించి చెప్పుచున్నారు ఆళ్వారులు. ౧౭

## ౯. వెణ్ణెయ్‌విழுంగి.

కృష్ణని దుండగములను తల్లియందు మొఱపెట్టుట.

శ్లో॥ గేహే గేహేచ గవ్యాన్యసకృదపహరన్ భాణ్డభఙ్గం చకుర్వన్ ముష్ణన్ భక్ష్యాణి కన్యావలయమపహరన్ తేతనూజో ఽతిధూర్తః । కృత్యాన్యేతస్య సోఢుం నవయమిహాపనాగపల్యాహో శక్నుమో భో మాన్యేధన్యే యశోదే ఝటితి తవసుతం శిక్ష యేత్యజ్ఞనాసు॥ ౧౮॥

శ్లో॥ ఆక్రోశన్తీషు మాతా ప్రముదితహృదయా కృష్ణదామో దర! త్వం మైవంకార్షీ రవజ్ఞాస్పదచరితతతిం వత్స మాయా హ్యుపేహి । తుభ్యంభక్ష్యాణి హృద్యాన్యహమిహ వితరాణ్యేహి మత్పార్శ్వమాశ్వి త్యాహూయాశ్లిష్యతిస్మేత్య భిదధతి మహాయోగిని స్వాం ప్రపన్నః ॥ ౧౯॥

కృష్ణుడు గొల్లెపల్లెలోనుండు ప్రతిగృహంబునను పలు దుండగంబులను చేయుచుండెను. వాని నంతయు గొల్లెతలు

యశోదతో మొఱబెట్టిరి. అది విని యశోద కృష్ణుని మృదూప
దేశంబులచే శిక్షించుచున్నది. 'తల్లీ! నీ కొమరుగు మా యిల్లు
జొచ్చి వెన్నలనంతయు ముచ్చిలి తిని వట్టికుండలను క్రిందవైచి
యాశబ్దమును విని సంతసించుచున్నాడు. పాత్రమున దాచి
పెట్టిన భక్ష్యములను దొంగలించి మమ్ములను ఇష్టప్రకారము
తిట్టుచున్నాడు. మాయిల్లు చొచ్చి నాపిల్లను బిలిచి చేతి
గాజుల నెత్తుకొని దానికి నేరేడిపండ్లను కొని తినుచున్నాడు.
ఇట్టి దుండగంబుల నోర్వజాలక యున్నాము. అమ్మా యశోదా!
కృష్ణుని బిలిచి శిక్షించుమా' అని మొఱవెట్టిరి. అది విని
యశోద సంతసించి 'కృష్ణా! ఇట్టి పనులను చేయక యుండుము.
నీకువలసినంత భక్ష్యములనిత్తును. వెంటనే యిచట నేగుమా'
అని ప్రేమతో బిలిచె. దగ్గఱవచ్చిన కృష్ణుని కౌగలించుకొని
సంతసించె. ౧౯

## ౧౦. ఆఱ్ఱిలిరున్దు.

శ్లో॥ కృత్వాగేహేషు చేష్టామథ రవితనయామాపగామేత్య
తత్ర స్త్రీణాం నేత్రేషు పఙ్కప్రకరమవకిరన్ కేశవో
మంక్షుహృత్వా। వాసోభూషాది తాసామథ రుదితవచాం
స్యుద్గమయ్య ప్రహృష్టః, తద్గోపీక్రన్దనాని ప్రవదతి భగ
వద్భట్టనాథేஉస్మి భక్తః॥ ౨౦॥

పూర్వదశకంబున వ్రేపల్లెలో జేసిన కృష్ణునిదుండగం
బులను గొల్లెతలు మొఱబెట్టిన విధంబులను జెప్పె. ఈ దశకం
బున యమునాతీరమున కృష్ణుడు కావించిన దుండగములను
చెప్పుచున్నారు. తల్లీ! నీకొమరుడు యమునానదిలో జలక

మాడుచునుండు మామీద బురదనుగొట్టి వస్త్రాదులను దొంగలించి ఇంటిలోదాగుకొని ఎంతపిలిచినను నోరుదెఱవక యున్నాడు. ఒకప్పుడు మాసర్వస్వమునపహరించి చెట్టుమీద నెక్కి కూరుచున్నాడు. ఇట్లు లెన్నోవిధంబుగా మమ్ములను భాధపెట్టుచున్నాడు. కాళీయునిమదము నణచినవాడు, ధేనుకాసురుని చంపినవాడు, గోవర్ధనాద్రి నెత్తి వ్రేపల్లెనే రక్షించినవాడు, ఇట్టి మహోపకారియయ్యు మమ్ములను బాధించుచున్నాడే. కృష్ణుని చేష్టలను సహింపజాలక ఱోకటిలో కట్టువడినవాడు యమళార్జునభంగ మొనర్చినవాడు, పూతనా స్తన్యంబులనుగుడిచి మనలను రక్షించినవాడు, గజేంద్రుని రక్షించినవాడు, త్రివిక్రమావతారమెత్తినవాడు, మమ్ములను బాధించుచున్నాడే.' అని యేచ్చినవిధంబులను వచించిన పెరియాళ్వారులతిధన్యులు.

పెరియాళ్వార్ తిరుమొళిలో రెండవపత్తు సమాప్తము.

---

# మూడవపత్తు.

## ౩. ౧. [తన్నేరాయిరమ్]

(కృష్ణునియతిమానుష చేష్టితంబులనుచూచి వెఱచిన యశోదా వచనములు.)

శ్లో॥ శ్రీకృష్ణో బాలకస్సన్నపిచ బహువిధా దివ్యచేష్టా స్తనోతీత్యేకైకస్మిం క్షణేఽపి ప్రచురవిభవమూ దృష్టవత్యాశ్రీ జనన్యా। హేకృష్ణ త్వామహాం వేద్మ్యతులపపుం అథతే స్తన్యదానేచ భీతాస్మీత్యుక్తం తత్తథైవాభిహితవతి మునౌ విష్ణుచిత్తే రమేఽహామ్॥ ౨౧॥

ఇంతవఱకు కృష్ణునకు బాలిచ్చుచుండిన యశోద ఇప్పుడు వానియతిమానుష చేష్టితంబులను చూచి వెఱచుచున్నది. కృష్ణా! నిన్ను ఇప్పుడెఱింగితిని. నీకు బాలిచ్చుటకు భయ పడుచున్నాను అని పదిపాశురములలోను చెప్పుచున్నది. నాయనా! నిన్ను నేను సాక్షాత్సర్వేశ్వరునిగా నెఱుంగుదును. నీవు సాధారణబాలకుడు కాఁజాలవు. అతిమానుష చేష్టితంబు లనేకములు చేయుచున్నావు. ఎల్లప్పుడును నీయతిమానుషచేష్టితంబులను చూచుచునే యున్నాను. పూతనాస్తన్యములతోబాటు నామె ప్రాణములనుగూడ గుడిచితివి. శకటాసురుని నొకక్షణముననే విఱగగొట్టితివి. నీదుండగంబుల నోర్వజాలక నిన్ను రోకటితోగట్ట నాఱోకటితోనేపోయి యమళార్జునభంగము కావించితివి. ఇట్టి యతిమానుష చేష్టితంబులను ప్రకటించు నిన్ను నారాయణునిగా నెఱుంగుదు. కనుక నీకు నాపుత్రునివలె పాలిచ్చుటకు వెఱచెద. దీనిని తద్భావనచే చెప్పిన పెరియాళ్వారులను నుతింతము. ౨౧

3. ౨. (అఞ్జనవణ్ణనై)

(కృష్ణుని యడవికి నంపి యశోద పిలపించుట)

శ్లో॥ ప్రత్యూషే బాలకృష్ణం మణినిభవపుషం గోపజాత్యాహ్వేకృత్యానుష్ఠానార్థం వనం ప్రత్యతికఠి నహృదా ప్రేషయన్త్యా జనన్యా। పశ్చాత్తత్రత్య యాతుస్థితిమపి బహుశస్సంస్మృశన్త్యా సఖేదం ప్రాలాపీత్యూచివాన్మే మనసి విజయతే విష్ణుచిత్తో మహాత్మా॥ ౨౨॥

క్రింది తిరుమొழిలో కృష్ణుని సాక్షాన్నారాయణునిగాన

ధ్వసించియుండిన యాయశోదయే దానిని మఱచి తనపుత్రుని గానే యెంచి ప్రొద్దుననే వానిని తనజాత్యుచితముగా నాలను మేప నడవికి నంపె. వెంటనే వానివిరహంబును దాళక కుందుచు, కృష్ణుడప్పుడప్పుడు చేసిన దుండగంబులనుదలచి 'ఐయో! ఇట్టిట్లు దుండగంబులజేయుచు నాటాడుచునుండిన నాకొమరుని ముల్లు నిండియుండు నాయరణ్యమునకు దయలేక యంపితినే!' అని తిట్టుకొనుచున్నది. దాని నటులే చెప్పిన పెరియాళ్వారులు నామనంబున విరాజిల్లుగాక. ౧౨

3. 3. (శీలై కృద్దమైచ్చ.)

కృష్ణుడడవినుండి సాయంకాలమున తిరిగిరాగా యశోద చెప్పిన యద్భుతవచనంబులను అనువదించుచున్నారు. ఈ తిరుమొழிసారమును ఎనిమిది పాశురంబులచే ననువదింతము.

శ్లో॥ బృన్దారణ్యే వయస్యైస్సహ బహులతరాః గోగణాం శ్చారయిత్వా సాయం కృష్ణస్సమాయాత్యనుపమ సుషమః పృష్ఠతోగోగణానామ్ । వన్యాలంకారధన్యం తమిమమనుకలం వీక్షమాణా యశోదా సానన్దం యద్వ దూచే తదిదమనిశమావర్తతే మానసే మే॥ ౧౩॥

బృందావనంబునందోడిపిల్లలతో ఆలనుమేపి గొప్ప కాంతితో అలమందల వెనుక ఏతెంచు కృష్ణుని దివ్యదేహుని పుత్రుని చూచి చూచి యశోద పరమానందము తాళక చెప్పిన వచనంబులన్నియు నామనంబున నటులే ప్రతిఫలించుచున్నవి అని యనుభవించిరి ఆళ్వార్లు. ౧౩

శ్లో॥ వైలక్షణ్యేన కర్ణాభరణముపవహాః చారువాసో వసానః

ముక్తాస్రగ్భూషణాఢ్యో మమతనయవరః పృష్ఠతో గోగ
ణానామ్! ఆయాతీక్షధ్వమేతం నయనశత సహస్రావలోకా
హ్లావేషం సత్యంసర్వాః స్త్రియోఽస్మిన్ జగతి మది
తరా హన్త వన్ధ్యాహి సఖ్యః॥ ౨౮॥

కుడిచెవిలో నొకవిధమయిన యాభరణంబును ఎడమ
చెవిలో నొకవిధమయిన యాభరణంబును ధరించుకొని రమణీ
యంబయిన వస్త్రమును తొడుగుకొని ముత్యములచే నలంక
రించుకొని నాకొమరుడు గోవిందుడు ఆలమందల వెనుక వచ్చు
చునున్నాడు. వీనివేషమును నూఱుకండ్లతో చూడవలయును.
త్వరగా వచ్చి చూడుడు. సత్యముగా చెప్పెద. ఈ భూమండ
లంబున నేనొకతయే కొడుకుపుట్టియుండుదానను. ఇతరులంద
ఱును గొడ్రాలే. సంశయములేదు. ౨౮

శ్లో॥ కల్యే ప్రోత్థాప్య కృష్ణప్రియసుతతిలక! త్వామహంభోజ
యిత్వా వత్సానాంచారణార్థం సుకఠినహృదయా
ప్రైషయం ప్రత్యరణ్యమ్! ఛత్రం పాదూంచనాదాం కిమహ
మకరవం బుద్ధిహీనావరాకీ తత్ర క్లేశానుభూతీ స్తవతు బహు
విధాశ్చిన్తయన్తీ విదూయే॥ ౨౯॥

ఓరి ముద్దుకృష్ణా! నాహృదయ మెంతకఠినము. వేకువనే
నిన్నులేపి భుజింపజేసి గోవులను మేపుటకై అడవికి నంపితివే!
ఎండ ముల్లు మున్నగువానిచే బాధలేకుండుటకై గొడుగును
పాదుకనుకూడ నివ్వకుంటినే! ఐయో! తెలివిచెడియే యీపని
చేసితి నొకో! అడవిలో నీవుపడు బాధలనంత మాటిమాటికి
దలంచి యిపుడు బాధపడుచు నున్నాను. ౨౯

శ్లో॥ మ్లానే పాదారవిన్దే, నయనకమలమప్యాప భూయో౽రుణత్వం శ్రీమత్ గోవిన్ద తే౽భూద్వపురపి బహుశో గోరజోభిః పరీతమ్। స్నానీయం సుష్ఠుసజ్జీకృతమిహ కలితస్నాన ఆయాహిభోక్తుం సాకం కృష్ణ ! త్వయైవాశితుముపవసతి ప్రేమధన్యః పితా తే॥ ౨౮

కృష్ణా నీపాదారవిందములు అతికఠినమయిన యీ యడవులయందు సంచరించుటవలవ వాడిపోవును. ఎండలో తిరుగుట వలన నీనేత్రములుకూడ నెఱ్ఱవాఱును. దివ్యదేహమును దుమ్ము వడును. ఇకచాలును గతచింతనము. స్నానమునకై నీకు సిద్ధముగానున్నది. త్వరగా జలకమాడి భుజింపనేగుము. నీతోనే భుజింపవలయునని నీతండ్రియు నుపవాసముగా నున్నారు. ౨౮

శ్లో॥ వత్స ! శ్రీకృష్ణ ! దామోదర జలదరుచే యామునే నీరపూరే ! తుంగాత్కున్దాన్నిపత్యోరగశిరసి తత్ధనాతిఘోరం హి యుద్ధమ్। హాహన్తైతన్నిశమ్యాప్యహమిహ నలభే జీవితస్య వ్యపాయం కస్మాత్ కంసస్య చిత్తే ముదముపజనయత్ కీడస్థితం కఠోరమ్॥ ౨౯

కారుమేఘమువంటి వాడా ! అడవిలో నీవు కాళియుండను సర్పముతో పోరాడినట్లు వింటిని. యమునా తీరంబున నుండు కుంద (మొల్ల) వృక్షము నెక్కి.. ఆపాముశిరంబున దుమికి ఘోరయుద్ధ మొనర్చితివట.. ప్రాణాపాయ కరమయిన యిట్టి పనులను నీవుచేసినట్లు వినియు నింక బ్రతికియున్నానే. నాహృదయ మెంతకఠినము! ఏరీతివయినను నీచావును కోరుచున్నాడు

కంసుడు. ఇట్టి సాహసకృత్యములను విన్నంతనే కంసుడతిసం తోషమొందును. ఏలయిన్నా ఆడెదవు. ౨౭

శ్లో॥ వత్సాత్మా కోఽపిదైత్యస్సముపగత ఇవారణ్యకోణే తమే నం ప్రోద్ధృత్య త్వం కపిత్థే వ్యసృజ ఇతికథా కాచిదాకర్ణితాభోః। సద్యస్సత్యం శపేఽహం మమతనయమణేర్వ్యై సృజన్వ్యాపదస్తే సోఽయంవత్సః కపిత్థోఽప్యలభత యదహో తల్లభేర్ణ క్షణేన ॥ ౨౮

ఓ కృష్ణా ! వేఱొక విషయంబునుకూడ నిపుడు వినగల్గితిని. కంసుడంపిన యొక రాక్షసుడు దూడరూపముం దాల్చి యడవికివచ్చెనట దాని నెత్తి పట్టి వెలగచెట్లమీాద విసరివేసితి వట. ఇదియు నీయతిసాహసకార్యము. అదియటుండ నిందుఁ ఓలోకులారా ! వత్సాసురుడును కపిత్థాసురుడును నాపుత్రుని జంప సంకేతముచేసుకొని వచ్చినారుగదా! వారొందిన గతినే మాపుత్రునకుం గీడుచేయందలచిన వారందఱు నొందుదురు గాక. ౨౮

శ్లో॥ లోకే కుత్రాప్యనాకర్ణితమిహ కిమపి శ్రూయతేస్మాద్య కృష్ణ ప్రత్తం గోపైర్మఘోనే దధి ఘృతమఖిలం శాకసూపాన్నమిశ్రమ్। నిశ్శేషం త్వం సమాశ్నా ఇతి నను భగవన్ ప్రాశయేయం కథంత్వాం అద్యారభ్యేతి భీతాఽస్మ్యహహ మధురిపో కుక్షిరన్యాదృశస్తే ॥ ౨౯

కృష్ణా ! ఇంతవఱకు వినకయుండు నొక విషయంబును ఇపుడు వింటిని. వాడుకచొప్పున గోపులు ఇంద్రునకు పాలు పెరుగు అన్నము మున్నము వాని నంతయు నర్పింప వానినం

తయు నొక క్షణముననే భుజించితివట. ఇట్టికడుపుండు నీకెట్టు భోజనము పెట్టగలను? నీకుక్షి విలక్షణముగా నున్నది. నీయిట్టి చేష్టితంబులను విన్నప్పుడునుండి నాకు భయముగానున్నది. ౨౯

శ్లో॥ కృష్ణ ! శ్రోణోత్సవస్తే సుతవర భవితా స్తప్తమేఽహ్న్యశ్చ
తదర్థం సర్వాసాంవల్లవీనాం పురఇహావిదధామ్యంకురారో
పణంచ। తస్మాన్మాయాహ్యరణ్యం పరదినతఇహైవావతిష్ఠ
స్వ భవ్యో గోపిన్దేత్యాహ మాతా తదిదమభిదధిద్విష్ణు
చిత్తోఽతిధన్యః ॥ ౩౦

కృష్ణా ! ఇక నేడవదినంబున నీ జన్మదినమయిన శవణ నక్షత్రము రాగలదు. అందుకై వ్రేతలనందఱను బిల్చి అంకు రారోపణము కావించితిని. కనుక నీవు రేపు మొదలు అడవికి నేగవలదు. విధేయుడై యిచటనే యుండుము. అను యశోదా భావనతో ననుభవించిన ఆళ్వారులతిధన్యులు. ౩౦

3.౮. తన్నైగళుం తొజ్గలుమ్.

బృందావనంబునుండి సాయంకాలము తిరుగు

కృష్ణునిజూచి యనుభవించుట.

సాయంకాలమున బృందావనంబునుండి వ్రేపల్లెకు తిరుగు కృష్ణునిజూచి వ్రేతలకు విలక్షణమయిన వ్యామోహముగల్గెను. దానికిం దగినట్లు వచనములును వెలువడెను. వానినంతయు నాళ్వార్లు ఈతిరు మొళిలో ననుభవించుచున్నారు. ఆఱు శ్లోక ములచే నీతిరుమొళిసారము చెప్పెద.

శ్లో॥ నానాబర్హాతపత్రైస్సహ సహ చగవాం భూరిబృందైర్దినాన్తే
సానన్దం గోపబృంద ప్రత్యుపగత ముదితాలంకృతం నన్ద

సూనుమ్ । దర్శందర్శం విముగ్ధైర్వ్రజయువతిగణైర్య
త్కృతం పారవశ్యాత్ యచ్చ ప్రేమ్ణాఽభ్యధాయి ప్రణి
హితమనసాం యోగినామప్యగమ్యమ్ ॥ ౩౧

నెమిలిపింఛముల ధరించుకొని ఆలమందలతో సాయం
కాలమున విచిత్రాలంకారాలంకృతుడై కృష్ణుడు వ్రేపల్లెకు
వచ్చె. అప్పుడు వానిని పలుసారులు చూచిన వ్రేతలు చేయు
చేష్టలను మాటలను మహాయోగులయిన వ్యాసపరాశరాదు
లకునగోచరంబుగానుండె. అట్టిది ధన్యధన్యులయిన పెరియా
ళ్వారుల వాక్కునకు మాత్రము విషయమయ్యె. (ఇదిదాసుని
సొంత వచనము.) ౩౧

శ్లో॥ కట్యాం కృష్ణస్య భాతం కిసలయరుచిరం కోమలం దివ్య
వస్త్రం తస్యోర్ధ్వం ఖడ్గబన్ధో దృఢతరఘటితస్తత్రి పట్టోప
బన్ధః । వన్యాలఙ్కారధన్యా తనురుచిరతులా గోపబాలా
ఘుమధ్యే సాయంసోల్లాసయానం కథమిదమధునా మాదృ
శాంచిన్తనార్హమ్ ॥ ౩౨

చిగురురంగు గలవసనమును దానిమీద ఖడ్గమును
ధరి[illegible]కొని, కచ్చగట్టుకొని అడవిపువ్వులను నెమిలి పింఛముల
దాల్చుకొని విచిత్రాలంకార శోభియై సాయంకాలంబున వ్రే
పల్లెకు నేగుచునుండిన యావేషముదర్శనీయము. అది దుర్భా
గ్యులయిన మనకు లభింపదుగదా?. ౩౨

శ్లో॥ లీలాయష్టిం కృపాణం ధనురతికమనీయోత్తరీయంచ
మిత్రేష్వాదాయాగ్రే ప్రయాతేష్వథ పరమసుహృద్రత్న
మంసేఽవలంబ్య । ఆయాన్తం నన్దసూనుం బతమమతనయా

వీక్ష్య సౌన్దర్యమగ్నా గాఢందృష్ట్వాచ పార్శ్వే స్యవిశత
జనతాశ్చక్షతేఽత్రాపవాదమ్ ॥ 33

అడవిలో నాడునపుడు లీలావేత్రము ధనుసు కత్తి
మున్నగునవి కృష్ణునియందుండె. ఇంటికిం దిరుగునపుడు వానిని
స్నేహితులు ఎత్తుకొని ముందుగ పోవుచున్నారు. కృష్ణుడు తన
ప్రాణస్నేహితునిమీద చేయివేసుకొని యుల్లాసముగ నడచు
చునున్నాడు. అప్పుడు వానింజూచి నాకూతురు వానిసౌందర్యం
బున మైమఱచి లజ్జాభయాదులను గూడ వీడి వానిప్రక్కన
నిల్చె. దీని నాపెతల్లి యతిసంతసంబుతో ననుచున్నది. సత్య
మిట్లుండ నీప్రేపల్లెలో నుండువారందఱు నా కూతురుమీద
వృథాపవాదములం జెప్పచునున్నారే. ఐయో ! 33

శ్లో॥ హాహా నాహం కదాపీదృశసుభగతనుం ప్రైక్షిషీ
త్యాహ కాచిత్ నాహంచేదస్యభార్యా నఖలుమమ
భవేజ్జీవితాశేతి కాచిత్। కాచిద్ద్రూబ్రూతేస్మ సోఽయం యది
మమ భవన ప్రాన్తమాయాతి తర్హి. ప్రోచ్య స్తేయం
పరీత్య ప్రసభమథ నిరీక్షేయ తద్వక్త్రహాసమ్ ॥ 3౪

అప్పుడొకతె చెప్పె, హా హా ! నే నిట్టి సౌందర్యగని
నింతవఱకుం జూడలేను అని మఱొకతె; వీను నన్నుం జేపట్ట
కుండినయెడల నేను జీవింపను అని. ఇకొకతె, నా గుమ్మము
ముందఱవచ్చినయెడల 'నాగందుకము నపహరించిన వాడుగదా
వీడు' అను నొకవ్యాజమును అసత్యముగ కల్పించుకొని వాని
మీద నేరమును మోపి అప్పుడు వాడుండు రీతిని వదనసౌందర్య
మును చూచి యానందించెద. 3౪

శ్లో॥ సర్వాలంకారరమ్యస్సకలజనమనోహారిరూపోఽత్ర గోపః
కశ్చిత్సోల్లాసమాయాత్యముమిహ సుభగే మాస్మదర్శః
కథఞ్చిత్! ఇత్యుద్ఘోషే కృతే సత్యపి మమదుహితా తస్థు
షీచత్వరాగ్రే ప్రాపత్కార్శ్యం క్షణేనేత్యచకథదతినిర్వే
దతః కాఽపి వృద్ధా ॥ 37

ఒకముసలి చెప్పుచున్నది. సమస్తాభరణంబుల ధరించు కొని సర్వమనోహారియై యుండు నొక గోపుడీవీధిన నుల్లాస ముగా నేగుచున్నాడు. ఓపుత్రికా! వానిని నీవు చూడక యుండుము. నీవు వానిని చూచినచో నీసర్వస్వము నపహ రింపబడును. జాగ్రతగా నుండుమని హెచ్చరించితిని. ఈ మాటను విన్నంతనే యాపె ఇంటిలోపల నుండంజాలక వానిం జూడ బయటె వచ్చినిల్చె. క్షణముననే వాని సంశ్లేషము దొరకలేదే యను దుఃఖమున నొడలు చిక్కిపోయె. ఇది యేమి యన్యాయమో కా. 37

శ్లో॥ సాలంకారం సవేణుధ్వనిరచనముపాయాతికృష్ణే సుతామే
తిష్ఠన్త్యగ్రేఽవివేకాదభజత సహసా ప్రచ్యుతిం కఙ్కణా
నామ్। ఇత్యూచే కాఽపిగోపీత్యతి మధురవచోరాశిభిర్గో
పకన్యాప్రేమావేశం ముకున్దే విశదమభిదధద్విష్ణు చిత్త
స్సుధన్యః ॥ 38

ఇంకొక గోపిక చెప్పుచున్నది. సర్వాలంకార భూషి తుడై కృష్ణుండు వేణుగానముచేయుచు తోడిపిల్లలతో నేగుచు చున్నాడని యెఱింగి నాకూతురు ఎదుట నిలిచె. వెంటనే యొడలంతయు జిక్కిపోయి వలయంబులంత జారె. ఇట్లీ రీతిగా

కృష్ణునియందు గోపకలు కావించిన ప్రేమపారవశ్యంబు ననువదించిన పెరియాళ్వారు లతిధన్యులు. 3౬

### 3. ౫. అట్టుక్కు-విశోక్‌ఙ్ఙు.

(గోవర్ధనాద్రి ప్రశంస.)

శ్లో॥ ప్రత్యబ్దం గోకులే యద్భవతి దివిషదాంపత్యు రారాధనం
తత్ దృష్ట్వాకృష్ణః కదాచి త్తదిదమనుచితం భూధరాయైవ
దేయమ్। ఇత్యుక్త్వా దాపయిత్వా తదఖిలముపభుజ్యాశు
వృష్టిం గరిష్ఠాం సుత్రామక్రోధసృష్టామరుణదనుపదం
ఛత్రమద్రిం దధానః ॥ 3౭

ఇత్యుక్త్వా ప్రాజ్యకీర్తిం దధతమనుపమం దివ్యగోవర్ధనాద్రిం స్తోతుం ప్రక్రమ్య నన్దాత్మజహరిచరితం దివ్యభోగ్యం ప్రశంసన్ । సాక్షాద్ద్రిష్టేవ దివ్యం సుభగమనుభవన్ దివ్యసూక్త్యా ప్రయచ్ఛన్ వేదాన్తామ్భోధిసున్ధాచలఇవ విలసన్ విష్ణుచిత్తో గతిర్నః ॥ 3౮

వ్రేపల్లెలో బహుదినంబులుగా శరదృతువున దేవేంద్ర పూజనంబను నొక వాడుకగలదు. అందుకై గోపులందఱు ప్రతిగృహంబున నుండియు పలువిధంబులయిన భక్షణంబులను అన్నరాశిని బండి బండిగా నెత్తుకొనిపోయి గోవర్ధన పర్వతంబు నొంది అచ్చట దేవేంద్రుని పూజించుటయే. ఇట్లు బహుదినంబుగా జరుగుచునుండె. ఇది యిట్లు జరుగుచునుండ నొకప్పుడు కృష్ణుడు పరదైవతమయిననే నుండ నొక క్షుద్రదేవతకు పూజ చేయుటయా! యని యెంచి కాబోలు ఆపూజను నిలుపదలంచి యాపూజకు వలసిన సంభారముల సేకరించుచు నున్న గోప

వృద్ధులను చూచి యేదియు తెలియనివానివలె దాని కారణంబు నడిగె. వారును 'కృష్ణా! నీవెఱుంగవా ? ఇది ప్రతివర్షమును జరుగుచున్నదే. గోవులే ధనముగాగల మనకు పచ్చికలకై వర్షము ముఖ్యము. అందుకై ఆవర్షాధిపతియయిన దేవేంద్రుని పూజించుటవాడుక.' అనిరి అదివిని కృష్ణుడు* యోవై స్వాం దేవతామతియజతే ప్ర స్వాయై దేవతాయై చ్యవతే న పిరాం ప్రాప్నోతి, పాపీయాన్ భవతి * అని శ్రుతి. మనకీగోవర్ధన పర్వతమే ప్రత్యక్షదేవత. అదియే మనకు గోవులకుం గావలసిన పచ్చికలను నీటినిచ్చి కాపాడుచున్నది. అట్టి దీనిని వదలి పరోక్షమున నుండు దేవేంద్రుని పూజించుట యన్యాయ్యము. ఈ యన్నరాశినంతయు నీ గోవర్ధన పర్వతంబునకే యర్పించుడు. అనెను అది విని గోపులందఱు న్యాయ్యమే యని యొప్పుకొని యా పర్వతంబునకే యర్పించిరి. తన పూజ నిల్పినందుకు దేవేంద్రుడు కోపించి పుష్కలావర్తకాది మేఘంబులను వ్రేపల్లె యంతయు కొట్టుకొనిపోవునట్లుగా వర్షింపుమని నియోగించె. ఈ వర్షబాధం దాళక వ్రేపల్లెయంతయు తల్లడిల్లె. అది చూచి కృష్ణుడు గోవర్ధన పర్వతంబునెత్తి గొడుగువలె నేడుదినంబులు పట్టుకొనియుండి గోకులంబును గోవులను అందఱను రక్షించె. ఇదిచూచి యింద్రుడు లజ్జించి అపచారక్షమాపణము కావించుకొనియె. ఈ కథను ప్రదర్శించుచు కృష్ణుని గోవర్ధనాద్రిని పదిపాశురంబులచే నుతించిన పెరియాళ్వారులే మనకుంగతి.

## ౩. ౬. [నావలం పెరియ].

### (కృ ష్ణు ని వే ణు గా న వ ర్ణ న ము)

శ్లో॥ శ్రుత్వా కృష్ణస్య వేణుధ్వనిమమృతమయం మేనకాద్యప్సరస్
స్త్రీసఙ్ఘో వ్రీడాభీభూతో౽భవ బత విజహౌ స్వస్వకృత్యం
విమోహాత్। గ్రాసగ్రాహీ మృగౌఘోప్యచలితదశనో
భిత్తిచిత్రాయితో౽భూత్ వృక్షాశ్చైతస్యభాజో మధు
సుమమకిరన్ సంగతాః కృష్ణపార్శ్వే॥ ౩౯

జమ్బూద్వీపే౽ ద్వితీయాద్భుతమిదమహహా శ్రావ్యమి
త్యచ్యుతస్య శ్రీకృష్ణస్యాప్రమేయం మధురమురలికాగాన
వైదగ్ధ్యముక్త్వా। అస్మాదృక్కర్కశాన్తఃకరణమపి జడీ
కుర్వతా విష్ణుచిత్తేనాత్యన్తశ్లాఘ్య వాచా౽స్మద్గృహమపి
కలితసాధుగోష్ఠీం ప్రవిష్టః॥ ౪౦

ఈతిరు మొళిలో కృష్ణునిమురళీగానము వర్ణింపబడు చున్నది. *శైలో౽గ్నిశ్చ జలాంబభూవ మునయో మూఢాంబభూవుః జడాః ప్రాజ్ఞామాసురగాస్సగోపమమృతామాసుర్మహాశీవిషాః। గోవ్యాఘ్రాః సహజాంబభూవురపరేత్వన్యాంబభూవుః ప్రభో! త్వం తేష్వన్యతమాంబభూవిథ భవద్వేణుక్వణోన్మాదనే* అని శ్రీపరాశరభట్టరును శ్రీరఙ్గరాజస్తవమున ఉత్తరశతకమున ననుభవించిరి. అట్టి వేణుగానమును విన్నంతనే రంభోర్వశీమేనకాద్యప్సరసలు సిగ్గుపడి తమతమయాటపాటలను వదలివేసిరి. పచ్చిక మేయబూనిన జింకలుకూడ తమకార్యములను మఱచి చిత్రమువలెనుండెను. వృక్షములుకూడ ప్రాణమునొంది కృష్ణుని ప్రక్కనవచ్చి నిల్చి పూలవానగురిసె. ఇట్టి కృష్ణునివేణుగానము

నాలకించు భాగ్యము జంబూద్వీప వాసులకు చేకూరెనని యను భవించిన పెరియాళ్వారులు అసాధువులయిన మనలనుకూడ సాధుగోష్ఠిలో ప్రవేశింపజేసిరి. (* విట్టుశిత్తర్ విరిత్తతమిళ్ వల్లార్ .........శాదుగోట్టియుళ్ కొళ్ళప్పడువారే * అను నీ తిరుమొళియొక్క ఫలశ్రుతిపాశురంబు ననుసరించి దాసు నకు సాధుగోష్ఠీప్రవేశభాగ్యము చెప్పబడియె.]

3. ౭. [ఐయపుళుది]

పెరియాళ్వారులు స్త్రీభావంబునొంది
తల్లిచెప్పురీతిగా చెప్పు తిరుమొళి.
(ఇందు మొదటి శ్లోక మవతారిక.)

శ్లో॥ భక్తేః శృంగారవృత్త్యా పరిణతిరిహా చేజ్జాయతే తర్హి
పుంస్త్వచ్యుత్యా స్త్రీవేషధృత్యా ప్రకథనసరణిః కాచి
దన్యాదృశీ స్యాత్ । మాతుః పుత్ర్యాస్సఖీనామపి వచన
మిషాత్ ప్రేయసి శ్రీసహాయే స్వప్రేమావిష్కృతిస్స్యాత్
ఇహాతు మునివరో గాహతే మాతృవేషమ్ ॥ ౭౧

విష్ణౌ ప్రేమప్రకర్షాదధిగతవనితాభావనః స్వామవస్థాం మా
తుర్వాచా వినక్తి బత మమ దుహితా బాలికైవ
హ్యథాపి । శ్రీశే రూఢానురాగా కథయతి సతతం తత్క
థాశ్శఙ్ఖచక్రవ్యాముగ్ధా కింను కుర్యామితి విహితవచా
విష్ణుచిత్తో గతిర్మే ॥ ౭౨

ఈతిరుమొళిలో పెరియాళ్వార్లు భగవంతునిమీద దన కుండు నభినివేశంబును స్త్రీభావనచే ప్రకటించుచున్నారు. నమ్మాళ్వార్లు కులశేఖరాళ్వార్లు పెరియాళ్వార్లు తిరుమంగై

యాళ్వార్లు అను వీరు తమతమదివ్యప్రబంధములలో మధ్య మధ్య స్త్రీభావనతో పాడియుంచిన పాశురంబులు గలవు. అవి దుహితృవాక్యము మాతృవాక్యము సఖీవాక్యంబని ముప్విధం బులు. ఇచ్చట మాతృవాక్యంబు ననుసరించురీతిగా తనకు భగ వంతునిమీదనుండు ప్రేమను ప్రకటించుచున్నారు. దీనితల్లి తన కూతురివిషయంబు నీరీతిగా నుడివెనని యీతిరుమొళియు పై తిరుమొళియు.

పురుషులుగా నవతరించిన యాళ్వార్లకీ స్త్రీభావన యెట్లు గల్గెను? ఏలగల్గెను? అనుశఙ్కను పరిహరించును "భక్తేః శృఙ్గారరీత్యా" అను ప్రథమ శ్లోకము. దీనిభావము. భక్తియే యొకప్పుడు శృంగారముగా మాఱునుగాన నప్పుడు పుంస్త్వ మును వీడుకొని స్త్రీత్వము నారోపించుకొనుట న్యాయ్యమే. ఇది యొక యనుభవవైఖరి. ఇట్లుచెప్పుట మాతృవచనము దుహితృవచనము సఖీవచనరిబని ముప్విధంబుగానుండునని పూ ర్వమే తెలుపబడియె ఈమూడు నొకప్పుడే యేర్పడవు. ఒకప్పుడు పుత్రికా వాక్యము, ఒకప్పుడు సఖీవాక్యము ఒకప్పుడు మాతృ వాక్యము అని సమయభేదమునమండును. ఆళ్వారులే వక్త. ఇట్టి వచనవ్యాజమున భగవంతునిమీద తమకుండు ప్రేమాతిశయం బును వెల్లడిల్లజేయుదురు. ఈదశకంబున పెరియాళ్వార్లు మా తృవేషంబును ధరించుకొని ఆపెచెప్పునట్లు భగవంతునిమీద తన కుండు ప్రేమాతిశయంబును అసహ్యవిరహంబును మఱియు గొన్నింటిని ప్రకటించిరి. విష్ణుచిత్తయను నాకూతురు బాల్య మేయయ్యు భగవంతునిమీద గాఢానురాగంబునొంది యెల్ల

ప్పుడును వాని కథలనే చెప్పుచునున్నయది. వానియాయుధంబు లయిన శంఖచక్రాదులయందు నత్యంతవ్యామోహంబు నొంది యున్నది. ఇంతయతిబాల్యముననే ఇట్లు భగవద్విషయంబున ప్రావణ్యముతోనుండు దీనికి నేమింజేసెద. అని తల్లిచెప్పునట్లు అనుభవించిన పెరియాళ్వారులే మనకు శరణము. ౮౧-౮౧

3. ౮. నల్లదోర్ తామరై ప్పొయ్ కై.

(ఇదియు మాతృవచనమే.)

శ్లో॥ పూర్వావస్థానువృత్త్యా పునరపి వచసా మాతుః— ఏనాం మదీయాం పుత్రీం కృష్ణో వ్యముష్ణాన్మమ గృహమభవ చ్ఛోభయా శూన్యమేవ। శ్వశ్రూస్సైనాం యశోదా కిము బహుమనుతే క్లేశయేద్వా నిజానే బాలా దధ్నో నమన్థే ప్రభ వతి బహుధైవంబువిర్న సూరిరీడ్యః ॥ ౮3

ఈపాశురముంగూడ మాతృవచనమే. మఱియు చెప్పు చున్నది. ఐయో! నాపుత్రికను కృష్ణుడు అపహరించెనే. అందుచే మంచువడిన తామరవలె శోభచెడెనదయ్యో నాగృ హము. కృష్ణునిచే నేకాంతముగా నపహరింపబడిన నాకూతురు యశోదకుం గోడలయ్యె. అయ్యో! ఆయశోద తనకుంగిట్టదగని యిట్టికోడలు దొరకినందుకు అతిసంతసంబుతో బుజ్జగించునా? లేక పాలుచిలుకుట మున్నగు పనులనిచ్చి కష్టపెట్టునా? నా కూతురియత్త యింటిలో ఆవులమందలు అధికముగా నుండుట వలన ఎల్లప్పుడు పాలు చిలుకుటకే సరిగానుండును. అతిసుకు మారియయిన కృశాంగియయిన యీకూతురు ఇట్టి కఠినకార్య ముల నెట్లుచేయగలదు. ఇట్లు మాతృవాక్యముచే ననువదించి

తనకు కృష్ణపత్నీత్వమును స్థాపించిన పెరియాళ్వారులను నుతింతము.

ఈదశకంబున నాలుగవపాశురంబగు *ఒరుమగళ్ తన్నై యుడైయేన్ *అను రసవత్తరమయిన పాశురంబును కూరత్తాళ్వాను పరమపదించినప్పుడు ఉడైయవర్లు చెప్పి దుఃఖించిరని పెద్దలు చెప్పెదరు. ఆపాశురముయొక్క అనువాద శ్లోకము:— ఏకామేవ సుతామజీజనమహం త్రైలోక్య పూర్ణప్రథాం పుష్టామిస్మ రమామివ, అహరదిమాం రక్తాన్త నేత్రస్స్వయమ్। గామిష్ఛ ర్యాధ్యకుటుమ్బినీ జనితసత్సుతా యశోదాహ్వయా దృష్ట్వా హృష్టమనాః స్నుషాం కిము చరే ౪౩
ద్వైవాహికీః ప్రక్రియాః॥ ఇతి॥

3. ౫. ఎన్నాదన్ దేవికుట.

[రెండు గోపికలరూపంబును ఆవహించుకొని
పరస్పరము రామకృష్ణావతార కథలను వర్ణించుట.]

శ్లో॥శ్రీకృష్ణస్యైవ చేష్టాఃకథయితుమిత్తోత్సాహభాకాఽపి
గోపీ శ్రీరామస్యైవ చర్యాః కథయితుమితరేత్యేవ
మాస్థాయ గోప్యోః। మూర్తీ, కృష్ణస్య రామస్యచ మధు
రకథాః పారిజాతాపహార శ్రీపాదూదానముఖ్యాఅభిదధ ౪౪
దతులో విష్ణుచిత్తోఽభినన్దన్యః॥

శ్రీకృష్ణునిచరితంబులవలె రామునిచరితంబులను కూడ ననుభవింపవలయునని కోరిక వొడమెను ఆళ్వారులకు. అందును వారలగుణంబులను ఒకప్పుడే యనుభవింపవలయునని యిచ్ఛగించె. వెంటనే అళ్వార్లు రెండుగోపికలవేషంబును

స్వీకరించి ఒక తెమూలముగా కృష్ణునిగుణంబులను, మఱొక తె మూలముగా రామునిగుణంబులను కీర్తించి అతిముదంబు నను భవించుచున్నారు. ఈ తిరుమొళిలో పాశురములు 1-3-5-7-9 కృష్ణగుణంబులను,2-4-6-8-10వ పాశురములు రామునిగుణం బులను అనుభవించునట్లు గోపికాకాన్యకలచే చెప్పుచున్నారు. వివాహాదికాలంబున గొబ్బితట్టుటయనునొక వాడుకగలదుగదా! ఆరీతిననే రామకృష్ణులగుణానుభవము జరుగుచున్నది. కృష్ణుడు ఇంద్రుని ప్రార్థనంబుమీాద నరకాసురుని చంపి, వాడు పూర్వ మపహరించిన యింద్రుని సమస్తసంపదలను గైకొని యింద్రున కిచ్చుటకు సత్యభామతోఁగూడ గరుత్మంతునెక్కి స్వర్గలోకం బునకేగె. అచ్చట నింద్రాణి సత్యకు సర్వోపచారంబులను చేసె. అయినను పారిజాతపుష్పము కేవలదేవార్హమే యని దలంచి దానిని మాత్రము సత్యకునివ్వకుండె. సత్య పారిజాత వృక్షంబును భూమికి నెత్తుకొనిపోవ కృష్ణునివేడె. కృష్ణుండును వల్లె యని నందనవనంబుచేరి యాకల్పవృక్షమును పెల్లగించుచు నుండగా యుద్ధమునకువచ్చిన యింద్రుని ఓడించి ఆవృక్షంబును గరుత్మంతు నెక్కించుకొని ద్వారకను నేగెను. అనుకథను అనెను కృష్ణగుణంబులను పాడు కన్యక. రెండవపాశురంబున తాటకా వధ-పరశురామభంగవృత్తాంబులనిమె రామగుణప్రియ. 3వ పాశురమున శిశుపాలవధము రుక్మిణి కల్యాణము, ౪లో కైకే యీా వచనంబుమీాద రాజ్యమును వీడి వనము ప్రవేశించుట, ౫లో కృష్ణునిరాయబారము భారతయుద్ధ నిర్వాహము, ౬లో భరతునకు పాదుకలనిచ్చిన విషయము, ౭లో కాళింగనర్తనము, ౮లో శూర్పణఖాంగభంగము ౯లో శకటాసురభంగ-యమ

ళార్జున భంజన-గోరక్షణ-వేణునాదకథలు, ౧౦లో సేతుబంధన రావణవధ విభీషణాభిషేకకథలు అను క్రమమున రామ కృష్ణావతారకథలు వర్ణింపబడినవి. ఇట్లు అనుభవించిన పెరి యాళ్వార్లు పరమభాగవతోత్తములు కాసియాడ దగినవారు.

3. ౧౦. నెఱిన్దకరుజ్గుళల్

[సీతాదేవియందు హనుమంతుడు గుర్తులను చెప్పుట.]

శ్లో॥ లఙ్కాయాం జానకీం ప్రాక్ పవనసుత ఉదీక్ష్యాత్మనో రామదూతీభావప్రత్యాయనార్థం రఘువరకథితాస్తా అభి జ్ఞానవాచః। విజ్ఞాప్య క్రోధరామోద్ధతిశమనముఖాః రామ నామాఙ్గులీయం దత్త్వా ప్రాహర్షయచ్చేత్యభిహితవతి మే విష్ణుచిత్తే దృఢా ధీః ॥ ౪౧

పూర్వదశకంబున ఒకే సమయంబున రామకృష్ణుల గుణంబులను అనుభవించి హర్షించిన యాళ్వార్లు రామగుణం బుల నింకయు ననుభవింపదలంచి రావణు డపహరించి యశోక వనికలోనుండు సీతతో రాముడు చెప్పియంపిన గుర్తులను హను మంతుడు చెప్పినట్లు ఈ తిరుమొళిని సాయించిరి. వివాహానం తరము పరశురామభంగము మొదలు మారీచునియాక్రందం బును విని లక్ష్మణుడు సీతను ఎడబాసిపోయినంతవఱకుంగల కథను చిహ్నముగాదెల్పి, 'రామనామాఙ్కితంబయిన యంగుళీ యకంబును సీతకు నిచ్చె మారుతి. సీతయు నద్దానినిసాదరం బుగా స్వీకరించి తలమీదనుంచుకొని పరమానందంబునందెనట. ఈ తిరుమొళిలో 6-వ పాశురంబున కాకాసురవృత్తాంతంబును మారుతి చెప్పినట్లుగ గలదు. ఇది వాల్మీకిరామాయణంబున

కనబడకుండినను, ఇదియునొకయనుభవప్రకారంబుకాన దోషం బులేదు. ఇట్లు హానుమద్వాక్యమూలముగా రామగుణంబులను అనుభవించిన 'పెరియాళ్వారులయందు నాబుద్ధి స్థిరంబుగా నుండుగాక.

మూడవపత్తు ముగిసెను.

---

# నాల్గవపత్తు.

౪. ౧. కదిరాయిరమిరవి.

[భగవంతుని అన్వేషించువారు కొందఱుగాను సేవించినవారు కొందఱుగాను తన్ను భాగించుకొని అనుభవించుట.]

శ్లో॥ భాస్వత్సూర్యాయుతశ్రీరుచిధరముకుటః పఞ్చహేతీవి
భూషః రామో న్యగ్రోధపత్రే విరచితశయనః కేశవో
దృశ్యతేచేత్। ప్రహ్లాదస్తూయమానః పశుపతిధనురుద్భ
ఞ్జనః సేతుకారీ సందృష్టోఽద్యైవ ధన్యైరితి కలితవచా
విష్ణుచిత్తో గతిర్నః॥ ౪౬

ఒకే సర్వేశ్వరుడు మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, రామ, కృష్ణాద్యవతారముల నెత్తియున్నాడు. అచటనుండు ధర్మియొకటియే యనుసత్యంబును దెల్పి విలక్షణానుభవంబు కావింపదలంచి యాళ్వార్లు ఇపుడు రెండురూపములను ధరించుకొని, ఒక మూర్తిచే భగవదన్వేషణంబును, ఇంకొకమూర్తిచే నిచట నాభగవంతుడు చూడబడియెననియు నీదశకంబున ననుభవించుచున్నారు. వేవెలుంగు తేజంబుగల శ్రీరామచంద్రుం డెచటనయిన చూడబడెనా? అని యన్వేషించు

నట్లు పూర్వార్ధము. హిరణ్యాక్షుని నఖంబును చీల్చి ప్రహ్లా
దునిచే నుతింపబడు నపుడు చూడబడినాడని యుత్తరార్ధమున
సమాధానము. శంఖచక్రగదాసి శార్ఙ్గాది దివ్యాయుధంబులు
గల భగవంతుని ఎచటనయిన చూచితిరా? అని పూర్వార్ధము.
జనకరాజుని సభలో శివధనువుని విఱిచి సీతను చేపట్టు నపుడు
నిపుడే చూచితిమని యుత్తరార్ధము. ప్రలయకాలంబున
జగత్తునంతయు నారగించి వటపత్రంబున పండుకొని యుండు
భగవంతుని చూచితిరా? అని పూర్వార్ధము. నీలాదేవిని
చేపట్టు సప్త ఋషభంబులతో బోరాడి శ్రాంతుడై యుండు
కృష్ణుండు చూడబడియెనని యుత్తరార్ధము. కువలయాపీడంబను
మదపుటేనుంగును చంపిన కృష్ణుని ఎచటనయిన చూచితిరా ?
అని పూర్వార్ధము. వానరవీరులతో సేతుబంధనంబు గావింప
నుత్సుకుండై సముద్రతీరంబుననుండు నతండు ఇప్పుడే చూడ
బడియెనని సమాధానము. ఇట్లు విలక్షణరీతిగా ననుభవించిన
పెరియాళ్వారులే మనకు గురువు. ౪౬

## ౪. ౩. అలమ్బావెరుట్టా.

(తిరుమాలిరుమ్శోలై విషయము.)

శ్లో॥ లోకప్రధ్వంసిరక్షోగణహననపటో రిన్ద్రపూజానిరోద్ధుః
హస్త్రితాతుశ్చ హస్తిక్షపణచణధియో వారుణాస్త్రప్ర
యుక్త్యై । పార్థాశ్వప్రీణనస్య స్థితిమతివిభవాం బిభ్రతి
శ్రీవనాద్రౌ ప్రేమాణం నిస్సమానం దధదమృతవచా
విష్ణుచిత్తో హి వన్ద్యః ॥ ౪౭

తిరుమాలిరుమ్శోలై యను వనగిరిలో శ్రీ సుందర

బాహు పెరుమాళ్లు వేంచేసియున్నారు. అతడెట్టి వాడనిన, వినుడు. ముల్లోకరాజులను హింసించుచునుండిన ఖరదూషణ రావణాదులను తుదముట్టించినవాడు, వ్రేపల్లెలో బహుదినం బుగా నడచుచుండిన ఇంద్రపూజను వారించి గోవర్ధనపర్వతం బున కాపూజనిడినవాడు, గజేంద్రుని గాపాడినవాడు, కువల యాపీడంబు మదంబునణచినవాడు, వారుణాస్త్రంబును ప్రయో గించి కాఅడవిలో నీరెత్తి దప్పిగొన్న పాండవుల యశ్వంబుల దప్పిని దీర్చినవాడు. ఇట్టి మహిమగల వనాచలంబుననుండు భగవంతునిమీద భక్తినొందియుండు పెరియాళ్వారులు మనకు వంద్యులు. ౪౭

## ౪. 3. ఉరుప్పిణినఙ్గైయై.

శ్లో॥ రుక్మిణ్యాం గాఢరూఢప్రణయభరితహృత్కాళియాదిప్ర హర్తా విధ్వస్తతజ్ఞోణిపుత్రో బలిజభుజవనచ్ఛేదనశ్చైద్య హన్తా। పాఞ్చాలీసూత్రరక్షీ దశవదనమదధ్వంసనో యత్ర రాగీ సోఽయం శ్రీకానసాద్రిశ్శరణమితి వదన్ విష్ణుచి త్తోఽవతాన్నః॥ ౪౮

ఇదియు తిరుమాలిరుంశోలై విషయమే. ఈకొండలో నుండు భగవంతుడు. రుక్మిణీదేవిమీద ననురక్తుడు, కాళియ యమళార్జున ధేనుకాదులను చంపినవాడు, నరకాసురుని తుద ముట్టించినవాడు, బాణాసురుని బాహువులను తుత్తునియలుగా వించినవాడు, శిశుపాలునిహన్త, ద్రౌపదీ మంగళసూత్రంబును గాపాడినవాడు, రావణసంహారకుండు, ఇట్టి మహావైభవంబు

గల ననాచలమేమనకుంగతియని యనుభవించిన పెరియా
ళ్వారులే మనకుం గతి. ౪౮

౪. ౪. నావకారియమ్.

(తిరుకోట్టియూరు విషయము.)

శ్లో॥ క్షుద్రస్తోత్రం మృషోక్తిం పరనరపరివాదంచయే నాద్రి
యన్తే యేషాం దుర్భిక్షకాలేఽప్యతిథిజనసమారాధనా
నిస్పృహానా । తైరాఢ్యే తన్నికాయ్యప్రచురమణిరుచి
ప్రోజ్జ్వలే దివ్యగోష్ఠీక్షేత్రే దీవ్యన్తమీశం స్తువతి ముని
వరే విష్ణుచిత్తే స్తుతిర్మే ॥ ౪౯

తిరుకోట్టియూరిలోనుండు భాగవతులను గొనియాడు
చున్నారు. ఇటనుండు శ్రీవైష్ణవులు క్షుద్రపురుషార్థంబులను
గోరి నీచులను పొగడరు. కల్లలాడరు, పరులను దూషింపరు.
కఱవుకాలంబునను అతిథులకు అన్నమిడువారు. ఇట్టి మహనీ
యులు వసించుస్థానమిద్ది. అట్టి భాగవతోత్తముల గృహంబున
నుండు రత్నములకాంతిచే వెలుంగుచున్నదీ నగరము. ఇట్టి
దివ్యదేశంబుననుండు సౌమ్యనారాయణ పెరుమాళ్ళను నుతించిన
పెరియాళ్వారులను నుతింతము. ౪౯

౪. ౫. ఆశై నాయ్ చ్చెన్ఱు.

(సంసారపాశంబును నిందించుచు భగవత్ప్రేమనుగొనియాడుట)

శ్లో॥ మాతా మే మేకలత్రం మమసుత ఇతి దుర్వాసనామూల
తృష్ణాః నిత్యం సంవర్ధయన్తో మృతిమియురిహ యే తే
విషీదన్తి హన్త । హృద్దేశే స్థాపయిత్వా మురరిపుమనఘ

ప్రేమపుష్పార్చనాభిః యే తం సంమోదయన్తే తఇహ
సుఖపరా ఇత్యుశర్ సూరిరీడ్యః ॥ ౫౦

ఈ తిరుమొళిలో భగవద్భక్తులనుగొనియాడుచు తద్వి
ముఖులను నిందించుచున్నారు. ఎవరు యావజ్జీవము నాభార్య
నాపుత్రుడు అను మమకారంబుతో పేరాసతోనుందురో;
వారు చచ్చినయెడల ననేకవిధములయిన యాతనలను అనుభ
వింతురు అని భగవద్విముఖ నిందనము. ఎవరు హృదయంబను
దివ్యదేశంబున మాధవుడను దేవతను ప్రతిష్ఠించి భక్తియనెడి
పుష్పంబును సమర్పించుచునుందురో; వారు ఈ లోకమునను
పైలోకమునను శాశ్వతమయిన సుఖములను అనుభవింతురు
అని భాగవతప్రశంసనము. ఇట్లుగావించిన యాళ్వారులను
నుతింతము. ౫౦

౪. ౬. కాశుమ్కత్తైయుడై.

(భగవంతుని నామంబిడుటయే అందఱకు శ్రేయస్కరంబనుట.)

శ్లో॥ తేతే స్వాత్మీయపుత్రాన్ ధనవసనముఖక్షుద్రవస్తు ప్వస్న
యైవ క్షోదిష్ఠైర్నామధేయైర్వ్యదధతి సహితాన్ తత్తు
హేయం విగేయమ్ । భిక్షాచర్యాఽపి వా స్యాన్మధు
మథనహరేర్దివ్యనామైవ ధార్యం సర్వైరిత్యుద్గృణానో
మమహృది నియతం విష్ణుచిత్తో విభాతి ॥ ౫౧

లోకంబునగొందఱు తమపుత్రులకు ఇంద్రచంద్రవసు
ణాది నామంబులనిడుచున్నారు. వారలకునుపదేశించు దశక
మియ్యది. లోకులారా! మీరేల మీసంతానంబునకు క్షుద్ర

నామంబులనిడుచునున్నారు ? దీనిచే నేమిలాభము. స్వయం ప్రయోజనమా? లేక ఆముష్మికఫలమా? ఈ రెంటికిని లేకు. ఏదో రెండు మూడు కాసులను కూడుకుడ్డలనుగోరి యిట్లు చేయుచున్నారే. ఐయో! ఇదియేమి యవివేకము. మీారీక్షుద్ర నామంబులకుబదులు భగవంతుని అచ్యుతుని కేశవుని శ్రీధరుని పుండరీకాక్షుని మాధవుని గోవిందుని దామోదరుని నారాయణుని దివ్యనామంబులనిడినయెడల మీాకు నీలోకంబునను పైలోకంబునను మేలుచేకూరును. భగవన్నామంబిడిన యెడల దారిద్ర్యముగల్గినను గల్గుగాక. బిచ్చమెత్తియయినను కుక్షిని పూరించుకొనవచ్చునే. స్వరూపవిరుద్ధమయిన నామ కరణంబునుమాత్రము చేయకుండుడు. నరకనాశకుని నామ మిడుటయే మనకు నరకనాశకంబగును. అని యుపదేశించిన యాళ్వార్లనామంబున వసించుగాక. ౫౧

## ౪. ౭. తఙ్గైయై మూక్కు-మ్.

(దేవ ప్రయాగ విషయము.)

శ్లో॥ గఙ్గాగఙ్గేతి వాచా దురితమఖిలమప్యాశు హన్త్రాస్యైః ప్రతీరే
భాగీరథ్యా నివాసం విదధతమమరైశ్శమ్భుముఖ్యైర్యన్తా
జిష్ణుమ్। శ్రీఖణ్డాభిఖ్యపుర్యా అధిపమధిగుణం దైత్య
రక్షోగణఘ్నం సంసేవ్య ప్రీతచిత్తో విలసతు హృదయే
విష్ణుచిత్తో మదీయే ॥ ౫౨

శ్రీబదరికాశ్రమ మార్గముననుండు "కణ్డమెన్నుమ్ కడినగర్" అను క్షేత్రంబును దేవప్రయాగయని వ్యవహరింతురు. శ్రీఖండక్షేత్రంబని సంస్కృతనామము. గంగాతీరంబున

నుండు నీదివ్యక్షేత్రంబున పురుషోత్తముండను నామంబుతో విరాజిల్లుచున్నాఁడు. ఆ దివ్యదేశవిషయమీ తిరుమొழி. ఏదేనొక నూతిలోనో గోతిలోనో స్నానముసాడుచునుండువారు గంగ గంగ అని చెప్పినయెడల వెంటనే వారల సర్వపాపంబులును బూడిద పాలగుసని యనుట యతిశయోక్తిగాదు.—అట్టి మహాప్రభావపరిపూర్ణమయిన గంగాతీరంబున నిత్యసన్నిధి సేయు బ్రహ్మరుద్రాది సేవితుండగు రాతుసాంతకుని దేవప్రయాగక్షేత్రనాథుని అమితగుణసాగరుని భగవంతుని సేవించి ప్రీతులయిన యాళ్వార్లునామనంబున విరాజిల్లుగాక. ౧౦

ర. ౮. మాదవత్తోళ.

(1. శ్రీరంగ విషయము.)

శ్లో॥ సాందీపన్యాత్మజన్మానయనమథ పరీక్షిత్సముజ్జీవనం చ శ్రీవైకుణ్ఠాచ్చతుర్ణాం ద్విజతనుజనుషామాహృతిశ్చేత్యమూని । అన్యాన్యాశ్చర్యకృత్యాన్యపిచ కృతవతా మాధవేనాతిదివ్యత్ శ్రీరఙ్గం స్తోత్రపాత్రం విదధదనఘవాగ్విష్ణుచిత్తో గతిర్నః ॥ ౩

ఇది మొదలు మూడు దశకంబులు శ్రీరంగవిషయకంబులు. అవంతీనగరంబున సాందీపనిమునియొద్ద బలరామునితో విద్యల నభ్యసించిన పిమ్మట గురుదక్షిణగా వేడినవారి యపేక్షచొప్పున ప్రభాసఘట్టమున ౧౨ సంవత్సరములకు బూర్వము మృతినొందినవాని పుత్రుని దెచ్చుట, సూతికాగృహంబున మరణించిన బిడ్డలై యేడ్చు బ్రాహ్మణుని ప్రార్థనంబుమీఁద మహాలక్ష్మిచే నపహరింపబడియుండు వాని బాలురను దివ్యలోకం

బునుండి తెచ్చియిచ్చుట, భారతయుద్ధమున నపాండవాస్త్రం బును బ్రయోగించి చంపిన ఉత్తరాగర్భపిండమును బ్రతికించుట, మున్నగు నాశ్చర్యచేష్టితంబులొనర్చిన భగవంతుడు వసించు శ్రీరంగక్షేత్రమును నుతించిన యాళ్వారులే మనకుం గతి. ౧3

౪. ౧. మరవడియైత్తమ్బికుఱ.

శ్లో॥ వాత్సల్యం భక్తవర్గే నిరతిశయమిహా ఖ్యాపయన్ భక్త
రక్షో ఉద్యుక్తే స్వం పక్షపాతం నిరపధిముపసందర్శయన్,
దుష్టవర్గమ్ । కుర్వన్నిర్మూలమచ్చైః కరివరవిపదుద్ధ్వంసి
చక్రస్స దేవః శ్రీరఙ్గే సేవనీయో భవగదభిషగిత్యూచి
వాన్ సూరిరీడ్యః ॥ ౧౪

పూర్వము రామావతారమున భరత విభీషణాదిభక్తుల యందు ప్రదర్శించిన వాత్సల్యమును పక్షపాతంబును ఈయర్చావతారంబునంగూడ ప్రదర్శించుచు దుష్టవర్గనిర్మూలనంబుగావించుచు గజేంద్రునియాపదను వారించినవాడు సంసారమహావ్యాధిని బోగొట్టువాడు దేవదేవుడు శ్రీరంగంబున విచ్చేసియున్నాడు సేవింపుడు అని సాయించిన యాళ్వార్లననుతింతము.

ఈ తిరుమొళిలో రెండవ పాశురం బతిస్వారస్యమయిన పాశురముగాన ధానిని వివరింతము. *తన్నడియార్ తిఱత్తగత్తు తామరైయాళాగిలుమ్ శిదకురైక్కుమేల్, ఎన్నడియార్ అదు శెయ్యార్ శెయ్దారేల్ నన్ఱు శెయ్దారెన్బర్ పోలుమ్ ... ...* అని పాశురము. దాని యనువాదము;

శ్లో॥ స్వభర్తృవిషయే రమాఽప్యభిదధాతి చేద్దూషణం మదీయ
జనతా రమే విరచయేన్న తాదృశ్కృతిమ్ । యది వ్యరచ
యద్ధ్రువం సుకృతమేవ తచ్చిత్ర ఇత్యుశన్నివ విభీషణ
ప్రవణదృక్ సరఙ్గీ గతిః ॥

శ్రియఃపతి పరమకారుణికుడయ్యు తన్నాశ్రయించు వారలనుకూడ వారలయపరాధంబులనుజూచి అంగీకరింపక * తానహం ద్విషతః క్రూరాన్ ఆసురీష్వేవ యోనిషు క్షిపామ్యజస్ర*మ్మని నిర్దయుడై ప్రవర్తింపసాగును. అదిచూచి ప్రక్కననుండు కృపామూర్తియయిన లక్ష్మి యీ చేతనుని యనుగ్రహింపదలంచి * కిమేతత్ నిర్దోషః క ఇహ జగతి? ఇతి త్వముచితైః ఉపాయైః విస్మార్య స్వజనయసి మాతా తదసి నః * (శ్రీగుణరత్నకోశము) అన్నట్లు ఇది యేమివని? ఈలోకంబున దప్పుచేయని వారొకరయినంగలరా? అను మొదలయిన ఉపాయవాక్యంబులచే ఘటకకృత్యముచేసి వానిని తనస్వాధీనము కావించుకొని చేతనుని యంగీకరింపజేయును. ఆపురుషకారమువలన భగవంతునకుంగూడ తనగుణంబులు జ్ఞప్తికివచ్చును. వెంటనే యాచేతనుని స్వీకరించును. అప్పుడును లక్ష్మికి ఒక సంశయముగలును 'భగవంతుడు వీనిని హృదయపూర్వకంబుగా స్వీకరించెనా? లేక నా నిర్బంధమునకై స్వీకరించెనా? అని. వెంటనే దానిని పరీక్షింపనొక యుక్తినిపన్నును 'స్వామీ! నేను విమర్శింపక స్త్రీచాపల్యముచే ఈచేతనుని విషయంబున ఘటకకృత్యముచేసితిని. ఇదియెంత పొరబాటు అని యిప్పుడే తెలిసెను. వీడుచేసియుండు దోషం

బులను చూడుడు. ఇంత దోషముగలవారినా యంగీకరించు చున్నారు? వెంటనే వీనిని వదలివేయుడు'—అని భగవంతుని భేదింపసాగును (పరీక్షకై). అది విని భగవంతుడు అనును 'లక్ష్మీ! నీ భక్తులొకప్పుడు తప్పుచేయనచ్చునుగాని నాభక్తులు మాత్రము ఒకప్పుడును తప్పుచేయరు' అని. మఱియు పరీక్షింప లక్ష్మి వారలదోషంబులనుచూపి నొక్కి చెప్పును. అందుకు భగవంతుడు 'నాభక్తులు అదిచేసినను సరియయిన పనియే' అని చెప్పును. అని ఇటులనొక సంవాదమును పూర్వార్థమున రెండవపాశురంబున వ్రాయించియున్నారు. ఈసంవాదమువలన భగవంతునివాత్సల్యాతిశయంబును భక్తానుగ్రహ విషయంబున స్థైర్యంబును ప్రకటింపబడును. వాత్సల్యమనగ దోషములను గూడ గుణముగాదలంచుటయేయని పూర్వాచార్యులు. దీనిని శ్రుతప్రకాశికాచార్యులు · శరణాగతిగద్యవ్యాఖ్యానమునను శ్రుతప్రకాశికలోను వ్రాయించిరి. సదాచార్యులిట్లు వాత్సల్యార్థమును నిష్కర్షించియుండ, ఆధునికులు కొందఱు పిళ్లైలోకాచార్యులు మణవాళమామునులు మున్నగు వారల శ్రీసూక్తుల వలె శ్రుతప్రకాశికాచార్యులు భట్టరు అను వీరల శ్రీసూక్తిని గూడ నిందింప నారంభించియున్నారు. భగవంతుడు, చేతనుల దోషంబులను జూచి శిక్షింపవలసియుండ వానినే గుణంబుగా స్వీకరించెనేని దోషభోగ్యుడని చెప్పబడినట్లాయె. ఇట్లయినచో భగవంతుడు మన దోషములను గూడ భోగ్యముగా గైకొను చున్నాడు గదా యని అందఱును బుద్ధిపూర్వకంబుగా దోషంబులనే చేయ నారంభింతురే. పాపులే యధికమై పోవుదురే.

ఇత్యాది కుచోద్యములం జేసి శ్రుతప్రకాశికాచార్యులను దూషింపనారంభించి యున్నారు. ఆవాదంబులకు సిద్ధాంతంబున సమాధానము వినుడు. భగవంతునకుండు కల్యాణగుణంబులో యనేకములు. వానికి లక్ష్యమైన చేతనుం డెవడని యొకరు నెఱగ జాలరు. * నాసౌ పురుషకారేణ నచాప్యన్యేన హేతునా। కేవలం స్వేచ్ఛయైవాఽహం ప్రేక్షే కంచిత్ కదాచన * అని యతడే చెప్పియుండుటచే వానికృపకు లక్ష్యము కాగలవాడెవడు? ఎప్పుడు కాగల డని? యొకరయిన నెఱగ జాలరు. ఏదో యొకప్పుడు ఏదో యొక వ్యక్తి విశేషంబుమీద వానికృప ప్రసరించును. అప్పుడు వాని దోషంబులనుగూడ గుణంబుగా దలంచును. అని సిద్ధాంతము. ఈ సిద్ధాంతంబున భగవత్కృప నామీదనే ప్రసరించునని యొకరును జెప్ప జాలరు గాన నొకరును బుద్ధిపూర్వముగా పాపము సేయబూనరు. భగవద్గుణస్వరూపమును చెప్పినంతనే ఏదో మునిగి పోయినట్లు ఇట్లు అల్లరిచేయుట తగదు. అట్లయినచో భగవంతునకుండు క్షాంతి యను గుణవిషయంబునగూడ నిట్లు వాదములను చేయవచ్చునే! 'క్షాంతిశీలుడయిన భగవంతుడు దండధరుడు కాజాలడని యందఱు బుద్ధిపూర్వముగా పాపములను చేయబూనుదురే' అని. లేదా, క్షాంతియను గుణమే భగవంతునకు లేదు అని యయినను చెప్పవలయును. అట్లయినచో 'తప్పులకుం దగిన శిక్షను విధించుటయే భగవద్గుణము. కనుకయే * వైషమ్య నైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్ * అని బ్రహ్మసూత్రముకూడ వచించియున్నది గదా? ' అవి చెప్పవలసివచ్చును. దీని నెవరయిన నొప్పుకొందురా?

వాత్సల్యంబను నొకగుణంబును ఆళ్వార్లును ఆచార్యులును ప్రత్యేకముగా ననుభవించియున్నారు. ప్రకృతపాశురంబున లక్ష్మీనారాయణులసంవాదంబువలన నెఱుంగదగిన విషయం బొకటి గలదు. 'మీరు స్వీకరించిన చేతనుడు దుష్టుడనియె లక్ష్మి మొట్టమొదట. నాభక్తు లొకప్పుడు దుష్టులుగా నుండరనియె భగవంతుడు. తిరిగియు దుష్టులని ఆగ్రహంబుతో నొక్కి చెప్పె లక్ష్మి. అట్లయిన దోషభోగ్యుడనయ్యెదనని యనియె భగవంతుడు. అనిసంవాద ప్రకారము. ఈసంవాదంబున దోషభోగ్యుడనయ్యెదనని భగవంతుడనినది చిట్టచివరి సమాధానము. మొదట నాభక్తులట్లు చేయరని సామాన్యముగా సమాధానము చెప్పె. దానికి లక్ష్మి సాగ్రహంబుగా దోషంబులను చెప్ప, అప్పుడే దోషభోగ్యుడనయ్యెదనని సమాధానము చెప్పవలసివచ్చె భగవంతుడు. ఇక దీనికి గారణం బేమని విచారింతము భక్తులు తప్పుచేయరుగాన మొట్టమొదట సామాన్యముగా సమాధానము చెప్పె. ప్రామాదికముగానో అగతిగానో తప్పుచేసినయెడల వానిని నేను దోషంబుగా గైకొననని తనగుణవిశేషంబును ప్రకటించె.

ఈపాశురంబున ఉత్తరార్ధమున సాయించిన విభీషణపక్షపాతంబుగూడ గమనింపనగును. సముద్రతీరంబుననుండె రాముడు. అప్పుడు విభీషణుడు వచ్చి శరణంబువేడె. వీడు దుష్టుడుగాన స్వీకరింపగూడదనిరి సుగ్రీవాదులు. అదుష్టుడుగాన స్వీకరింపవచ్చునని హనుమానుడు. ఈరెండుమతంబులను ఖండించె రాముడు * దోషో యద్యపి తస్య స్యాత్ సతా మేతదగర్హితమ్'ని. హనుమా! వీడు దుష్టుడు గాడుపొట

యేమి? దోషములే యుండనిమ్ము. గుణాతిశయంబులు గల్గ నిట్టివానిని వెదకుచునుండు నాకు నాదోషంబులు హేయము లగునా? అని. ఇట్లు విశృంఖలంబుగా ప్రవహించు భగవద్వా త్సల్యంబును ఎవరు అడ్డగింపగలరు. ఈ విషయంబులనంతే 'వాత్సల్యార్థప్రకాశిక' అను గ్రంథమున విశదముగా విచారించి యున్నారము. అచట చూడుడు. (౯౪)

౪. ౧౧. తుప్పుడైయారై.

[నరక వేదనలువీడ శ్రీరంగనాథుని ప్రార్థించుట.]

శ్లో॥ ప్రాణాన్తే దుర్గతౌ యా అహహ బహువిధా యాతనా
స్సంభవిత్ర్యః తాస్సోఢుం నాహమర్హః పటుతరకరణై
స్సాంప్రతం నాథ సర్వమ్। కైఙ్కర్యం తే క్రియాసం
ప్రణిదధదఖిలం చైతదాత్మీయచిత్తే శ్రీరఙ్గాధ్యక్ష రక్షే
త్యభిదధదనిశం మే గతిర్విష్ణుచిత్తః॥ ౯౯

లోకమున సంసారులందఱకు శరీరవియోగానంతరము యమకింకర బాధగల్గునని ప్రసిద్ధము. అదిచూచి మనసు తపించి * స్థితే మనసి సుస్వస్థే శరీరేసతి యోనరః। ధాతు సామ్యే స్థితే స్మర్తా విశ్వరూపంచ మామజమ్॥ తతస్తం మ్రియమాణంతు కాష్ఠపాషాణసన్నిభమ్। అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిమ్॥ * అని వరాహచరమం బున చెప్పినట్లు ప్రార్థించుచున్నారు. 'శ్రీరంగనాథస్వామీ! నాకు కరచరణాదిసర్వావయవంబులును సరిగానుండు నీ కాలంబుననే నీకువలసిన కైంకర్యములనంతయుం జేసెద. వాని నంతయు మీమనంబున నుంచుకొనియుండి నాశరీరావసాన

కాలంబున నన్నుగాపాడవలయుననె. ఇట్లు ప్రార్థించినయాళ్వార్లు నాకు శరణ్యులు.

* స్వపురుష మభివీక్ష్య పాశహస్తం వదతి యమః కిల తస్య కర్ణమూలే । పరిహర మధుసూదనప్రపన్నాన్ ప్రభురహ మన్యనృణాం న వైష్ణవానామ్ * కమలనయన వాసుదేవ విష్ణో ధరణిధరాచ్యుత శంఖచక్రపాణే । భవ శరణమితీర యన్తి యేవై త్యజ భట దూరతరేణ తానపాపాన్ * ఇత్యాది ప్రమాణశతంబుల ననుసంధించుచునుండు ఈయాళ్వారులకు నరకభయంబునకు బ్రసక్తియే లేదు. అయినను, ఈ ప్రకృతి మండలంబుననుండువారందఱును పడవలసిన భయంబుగాన నిది ఇట్లు ప్రార్థించిరి. (౧౧)

నాలుగవపత్తు ముగిసె.

---

# అయిదవ పత్తు.

## ౧. ౧. వాక్కుత్తూయ్మై.

(భగవంతునివద్ద అనన్యప్రయోజనకైంకర్యరుచిని విన్నపించుట.)

శ్లో॥ నాహం త్వాం స్తోతుమర్హామ్యతిమలినవచాః కింతు జిహ్వా సవేద త్వత్తోఽన్యం, తత్ప్రిణామి ప్రణతవశ హరే వాచి దోషాన్ క్షమస్వ । నైవాన్నం వస్త్రమిచ్ఛామ్యహ మిహ, సులభం తత్తు సర్వత్ర నాథ! త్వద్దాస్యం కామయే తద్వితర కరుణయేత్యాచివాన్ సూరిరీడ్యః ॥ ౧౬

ఓయఖిలగుణగణార్ణవా! బ్రహ్మరుద్రాదులకుంగూడ ధ్యానింపనశక్యుడయిననిన్ను అతి నీచమయిన రసన (నాలిక) గల నేను పొగడజాలను అను విషయము సత్యమే. అయినను నారసన నిన్నుదప్ప వేఱొకరిని ఎఱుగదే. కనుక నిన్నే అగతిగా స్తుతింపవలసివచ్చె. వాచికదోషంబులను సహింపవలయునని నీకు జెప్పవలయునో.

అదివిని భగవంతుడిట్లుచెప్పదొడంగె 'స్తోత్రముచేయకయుండజాలనని చెప్పుచు మెల్లగాదాపించి అన్నవస్త్రాది ఫలములనేగదా చిట్టచివర ప్రార్థింపబోయెదవు. ఇట్టిభక్తులు పలువురున్నారే. ఇక నీవు స్తోత్రమును చాలించుకొనుము అని. దానికి సమాధానము చెప్పుచున్నారు * నైవాన్నమిత్యాదిచే. స్వామీ! క్షుద్రఫలములను గోరరాలేదు. ఈప్రకృతిమండలంబుననుండు నంతవఱకు అన్నవస్త్రాది క్షుద్రఫలములయందిచ్చయుండవలసినదేయయ్యు వానిని భగవత్సన్నిధిలోనా ప్రార్థింపవలయును. వీడు నాదాసుడను గౌరవంబుచే నీవు ఆఫలములనప్పుడప్పుడిచ్చుచునుండవా? కనుక వానినపేక్షించుటయనవసరము. అనన్యప్రయోజనమయిన కైంకర్యమునుమాత్రమే ప్రార్థించెద. దానిని పరమకృపచే ననుగ్రహింపవలయునని ప్రార్థించిన యాచార్యులను నుతింతము. (౫౬)

౫౭. నెయ్క్కుడత్తై.

[భగవంతుడు తనియందుండుటచే దుఃఖరోగాదులకు వెడలి పొమ్మనుట]

శ్లో॥ స్వీయా భోగీంద్రశయ్యా కలశజలనిధిస్సన్ధుకన్యైత్యమీభిః

సాకం వైకుణ్ఠనాథో మమ హృది నిరతస్సూరిభీ రక్ష్యమాణః । హే పాపవ్యాధి దుఃఖోచ్ఛ్రయసు ఘుడితి సరక్షీణమత్ర స్థలం తే ప్రాగ్వన్నైవాద్య, రక్షాఽభవదితి కథయన్ విష్ణుచిత్తో మదీశః ॥ గి.2

పెరియాళ్వారులకు విష్ణుచిత్తుడను నామంబుగలదు. దానికి రెండువిధములయిన విగ్రహములు. (1) విష్ణౌ చిత్తం యస్య సః (విష్ణువుమీద మనముగలవారు) అనియు, (2) విష్ణుః చిత్తే యస్య సః (వీరిమనంబున విష్ణువుండును) అనియు. అందు రెండవవిగ్రహంబున జెప్పినట్లు విష్ణువు తనమనంబున నుండుటను ప్రకటించుచున్నారితిరుమొழிలో. భగవంతుడు తన శేషశయనంబును క్షీరాబ్ధిని ప్రియమహిషియయిన లక్ష్మీదేవిని వీడక వారందఱితోను స్థావరజంగమాదులతోను సదా వీరిని రక్షించుచుండు శంఖచక్రాదులతోను వచ్చిచేరి నామనంబుననే స్థిరవాసమయ్యె. ఇంతకు బూర్వము సానందముగా నిచటనుండిన పాపవ్యాధిదుఃఖరాసులా! ఇకమీదమీరు ఒక క్షణమయినను ఇచటనుండ జాలరు. వెంటనే వెడలిపొండు. ఇపుడు నా హృదయస్థితి పూర్వమువలెలేదు. భగవత్సంబంధముచే ప్రబలరక్షణంబుగలిగి హేయగుణంబులంతయు తొలగిపోయె. ఇక మీకు పాఱిపోవుటయేగతి. అని నుతించిన ఆళ్వారులే మనకుంగతి, (గి.2)

### గి-3. తుక్క-చ్చుఴలై యే.

### (తిరుమాలిరుమ్శోలై విషయము.)

శ్లో॥ స్వామిన్ ! త్వత్పాదపద్మప్రణతినిరతధీస్సోఽహ మన్యత్ర

దాస్యం ధ్యాయేయం చేతసా చేదపిచ తదిహా తేఽవద్య
దాయి క్రసిద్ధ్యేత్ । శర్వబ్రహ్మేన్ద్ర ముఖ్యా అపి న భవ
మయవ్యాధివైద్యా వనాద్రిస్వామిన్ శేషీ త్వమేవేత్య
భిదధతి మునౌ విష్ణుచిత్తే యతిర్శే ॥ ౯౮

క్రింద నాలుగవపత్తులో రెండవ మూడవ తిరుమొழி
లో నీదివ్యదేశంబునే యనుభవించియుండియు తృప్తినొందక
తిరిగియు ననుభవించుచున్నారు. ఇపు డిచ్చట నొక విలక్షణ
శాస్త్రార్థంబునుగూడ బ్రకటించుచున్నారు. స్వామీ! నీచరణార
విందంబులమీాదే ప్రవణుడైయుండు నేను నీవు రక్షింపలేవని
వేఱొకరియొద్ద దాస్యంబొనరింప మనంబున దలంచినను అదియు
నీకవద్యమే. * కిన్తు త్వదగ్రే శరణాగతానాం పరాభవః నాథ
న తేఽనురూపః * (స్తోత్రరత్నము) అనిరిగదా ! అన్యత్ర
దాస్యమొనరించినను నాకుద్దేశంబయిన మోక్షము గిట్టదు.
బ్రహ్మ రుద్రాదులు క్షుద్రఫలములనే యివ్వగలరు. మోక్షము
నివ్వజాలరు. కనుక నీవే శేషి; నీకైంకర్యమే సేయవలయును.
కనుక నీవెప్పుడును నామనంబుననే వసించుచు నుండవలయునని
ప్రార్థించిన యాళ్వారులమీాద నాకు భక్తిస్థిరంబుగానుండుగాక.

ఈ తిరుమొழிలో ఆఱవ పాశురంబయిన * ఎరుత్తు
క్కొడియుడైయానుమ్ * అను పాశురము సారమయినదిగాన
దాని ననువదింతము:—

శ్లో॥ నేశానో వృషభధ్వజో నచ పునర్వేధా నచేన్ద్రో న
చాప్యన్యః కోఽపి జనోఽస్య సంసృతిమహారోగస్య వేత్త్యౌ
షధమ్ । స్వామిన్ వైద్యమణే మణిప్రభ పునర్జన్మాపనీ

యాథ మాం త్వత్సదైస్మకనివాసినం కురు హారే శ్రీకాన
నాద్రీశ్వర ॥ అని. (౧౦)

౫–౪. శెన్ని యోఙ్గు.

(స్వకీయ బ్రహ్మానంద విజ్ఞాపనము.)

శ్లో॥ స్వస్య స్వాత్మీయవర్గైస్సహమపి భగవద్దివ్యహేత్యఙ్కి-
తత్వాత్ దగ్ధాశేషాఘతామప్యతిశయిత మహాజ్ఞానతాం
చాభిధాయ । దివ్యానన్దామృతాబ్ధి ప్రపతితహృదయః
స్వప్రబన్ధం సమాప్తం చక్రే యో భట్టనాథస్స జయతి
ధరణౌ కీర్తిమూర్త్యా సమృద్ధః ॥ ౧౧

ఈతిరుమొழிలో నాళ్వార్లు తానుగోరిన బ్రహ్మానందము చేకూరెననుచు ప్రబంధమును ముగించుచున్నారు. తనకును తనకుంజెందిన సమస్తవస్తువులకును భగవంతునిదివ్యాయుధంబయిన సుదర్శనంబుచే నంకితంబై యుండుటచే సమస్తపాపంబులును తొలగిపోయెను. గొప్పజ్ఞానసంపత్తిగల్గెను అని చెప్పి దివ్యానందామృతసాగరంబున మగ్నులై తనప్రబంధంబును పూర్తిగావించిన యాళ్వార్లు కీర్తిమూర్తులై యెల్లప్పుడు జిరాజిల్లుచున్నారు. (౧౧)

శ్లో॥ దివ్యం తస్య ప్రబన్ధం శ్రుతిశతశిఖరో దఞ్చదర్థౌఘగర్భం
ద్రావిడ్యా దివ్యవాచా స్థితమమరవచోఽభిజ్ఞభక్తాను
భూత్యై । కాఞ్చీస్థోఽణ్ణఙ్గరార్యో విబుధపరిషది ఖ్యాత
భూమా కవీన్ద్రో దైవ్యా వాణ్యా న్యబధ్నాత్ కృతిరిహ
జయతాత్సేయమాచన్ద్రసూర్యమ్ ॥

కంచి ప్రతివాదిభయఙ్కరమ్ అణ్ణఙ్గరాచార్యులవారు రచించిన
పెరియాళ్వార్ తిరుమొழிసారము సమాప్తము.

---

# ఆంధ్ర గ్రంథమాలా—పుస్తకసూచీ.





| | | | | |
|---|---|---|---|---|
| 36. | సభాభుజంగీ సర్వస్వము సటీక | 0 | 6 | 0 |
| 37. | తిరుప్పావై సటీక | 0 | 12 | 0 |
| 38. | ముకుందమాల సటీక | 1 | 0 | 0 |
| 39. | మంచియుపన్యాసములు | 0 | 4 | 0 |
| 40. | ,, | 0 | 4 | 0 |
| 41. | బ్రహ్మసూత్రములు | 0 | 8 | 0 |
| 42. | పూర్వాచార్యప్రభావము మొదటిభాగము | 0 | 12 | 0 |
| 43. | సప్తగాథ టీక | 1 | 0 | 0 |
| 44. | సత్సంప్రదాయసారనిధి | 0 | 12 | 0 |
| 45. | దివ్యసూరిప్రభావము | 0 | 12 | 0 |
| 46. | యతిరాజవింశతి సటీక | 0 | 12 | 0 |
| 47. | నాచ్చియార్ తిరుమొళిసారము | 0 | 10 | 0 |
| 48. | రామానుజపత్రిక | | | |
| 49. | రామానుజపత్రిక | | | |
| 50. | విశేషార్థరత్నమాల | 0 | 14 | 0 |

P. B. ANNANGARACHARYA

Conjeeveram

శ్రీ గోపాలకృష్ణప్రెస్సు ముద్రితము, ప్రాతచాకలపేట, మద్రాసు.

Q. H C. T. No. 23. C. 500. 24-12-47.

# ప్రకటన.

మదరాస్ దేవరాజ మొదలి వీధిలోనున్న శ్రీమాన్ కరాలపాటి. రంగనాథయ్య ప్రార్థనానుసారముగ వారియొక్క ద్రవ్యసహాయమువల్ల శ్రీవిష్ణుసహస్రనామ ఆన్ధ్రటీక అచ్చువేయబడుచున్నది. అది, పై ఏప్రిల్ నెలలో ప్రచురింపబడును.

1-3-48.

శ్రీః

ఈ సద్గ్రన్థ ప్రకాశన సభద్వారా ఇదివరకు ప్రచురింపబడిన తెలుగులిపి గ్రంథముల వివరణము:—

౧. తిరువాయ్మొழ్ళి వ్యాఖ్యానమైన భగవద్విషయము-ఈడు ముప్పత్తాఱాయిరప్పడి, ౬-వ పత్తు. మూల్యము — ఈ సభలో అన్వయము లేని ఇతరులకు 3–0–0

౨. పూర్వాచార్య ప్రభావము. (శ్రీమణవాళ మహామునుల పర్యన్తపూర్వాచార్యుల వైభవము. మూల్యము 1–8–0

3. నిత్యానుసంధేయ స్తోత్రజాలము. మూల్యము 1–4–0

౪. భగవద్విషయము ౭-వ పత్తు. మూల్యము 2–6–0

౫. తత్త్వశేఖరాది రహస్యచతుష్టయము. మూల్యము 1–4–0

౬. పెరియాళ్వార్ తిరుమొళిసారము. 1–4–0

—ఇప్పుడు ముద్రణయంత్రములోనున్న గ్రంథములు—

1. శ్రీదేశికులు సాయించిన పాదుకాసహస్రము.
2. శ్రీవిష్ణుసహస్రనామ ఆంధ్రటీక.
3. భగవద్విషయము ౮-వ పత్తు.
4. ఆంధ్రటీకాతాత్పర్యసహితమైన ముముక్షుప్పడి (తిరుమంత్రార్థము) మొదలైన రహస్యములు.

ఇట్లు,

G. MUSALAPPAREDDIAR Advocate,
Secretary
SATGRANTHA PRAKASANA SABHA
8, Mullasahib Lane.
G. T. MADRAS.
1–3–48.